# SUJANA MYTHRI

BY

*Diwan Bahadur*

R. SUBBAYYA NAIDU, B. A.



PRINTED BY

V. RAMASWAMY SASTRULU & SONS

MADRAS.

1939



Price Rs. 1 0 0.

# సుజనమైత్రి

ఇయ్యది

దివాన్ బహదూర్

ఆర్. సుబ్బయ్యానాయునిచే

విరచితము.



(రెండవకూర్పు.)

చెన్నపురి:

'వావిళ్ల' ప్రెస్సున

ముద్రింపఁబడినది.

రిజిస్టర్డు కాపీరైట్] 1939 [వెల రు. 1—0—

# సుజనమైత్రి

ఇయ్యది

దివాన్ బహదూర్

ఆర్. సుబ్బయ్యానాయునిచే

విరచితము.



(రెండవకూర్పు.)

చెన్నపురి:

'వావిళ్ల' ప్రెస్సున

ముద్రింపఁబడినది.

 1939 [వెల రూ. 1—0—



Diwan Bahadur R. Subbayya Naidu, B.A.

# సుజనమైత్రి

## మొదటి ప్రకరణము.

---

### విక్రమసింహపురము.

చరాచరజీవనిలయంబగు ధరాతలమ్మున నెట్టివారికిని, స్వదేశాభిమానమ్మును, స్వజాత్యభిమానమ్మును, స్వధర్మాభిమానమ్మును స్వభావజన్యములు. మనమనాదిసిద్ధముగ నేదేశమున నివసించుచుంటిమో, యనేక పురుషాంతరములనుండి యేప్రాంతమున నభివృద్ధిచెందితిమో, యేయూరజనించితిమో, యేయేప్రదేశములఁ జరించితిమో, యాదేశమున, నాప్రాంతమున, నాయూర, నాయాప్రదేశముల నదృశ్యానురాగపాశములచే బంధితులమై యుందుమనుట స్వభావసిద్ధము. కొందరు పురవాసులకుఁ గొన్నికొన్ని గుణవిశేషము లుండుటయుఁ బ్రపంచస్వభావము. దేశమాతయం దనురాగము గలిగియుండుటమాత్రము సర్వజనసామాన్యము. ఇట్టిభక్త్యనురాగపాశంబులచేఁ గవిజనుని బంధింపనైన విక్రమసింహపురమందలి గుణవిశేషము లిప్పుడు విశదీకరణీయములు. గుణవిశేషములు విచారించుటకుఁబూర్వము విక్రమసింహనగరివైఖరి యించుక యవలోకించెదము గాక.

విక్రమసింహపురము దక్షిణహిందూస్థాన సమంచితము. పినాకినీతీరపవిత్రీకృతము. రాక్షసధ్వంసకవీరనృసింహరాయనిర్మి

తము. శ్రీరంగధామున కాలయము. ఆంధ్రదేశభూషణము. ఆంధ్రమహాభారతోత్పత్తికిఁ గారణము. ప్రస్తుతము నెల్లూరు అని పిలువఁబడు మహానగరము. నెల్లూరు అనునది ద్రావిడ నామము. మున్ను చోళదేశాధీశు లీనగరము స్వాధీనముచేసి కొని కొన్నివర్షము లేలిరి. ఆకాలమున వారీనగరిధాన్యోత్పత్తి కచ్చెరువంది ద్రావిడభాషయందు "ధాన్యపురి" అను నర్థ మొసంగు నీ నెల్లూరు అను బిరుదనామము నొసంగిరి.

ఆహా, కాల మెట్టిమార్పులకుఁ గారణభూతము. దినములు గడచుకొలఁది ప్రపంచమున నెట్టిమార్పు లగుచున్నవో చూడుఁడు. నాగరికత యెట్టి యున్నతస్థితిని బొందుచున్నదో చూడుఁడు. వేషభాష లెట్టియనల్పాంతరమును బొందుచున్నవో చూడుఁడు. జనచర్య లెట్టి వైపరీత్యమును బొందుచున్నవో చూడుఁడు. సాంఘికచర్య లెట్టిమార్పుల నొందుచున్నవో కనుఁడు. స్వమతధర్మము లెట్టి యంతరాంతరములఁ బొందుచున్నవో యరయుఁడు. దినదినాచారము లెట్టి భేదమున వర్తిల్లుచున్నవో పరికింపుఁడు. ఎల్లవిషయముల స్వభావజన్యములగు నిట్టిమార్పులు గోచరములగుచుండఁ బలుమానిసులనోళ్లఁ బలుతెఱంగుల నుచ్చరింపఁబడు నొక్క యూరిపేరు కాలక్రమమున నామాంతరము వడసినదన నిది యొకవింతయే? కాలక్రమమున నలవడిన "నెల్లూరు" అనుపేరు అటుండుఁగాక. ఇఁక విక్రమసింహపురనామమునకుఁ గారణమేమని చదువరులకు శంకదోఁపవచ్చును. విక్రమసింహపురమందలి గుణాతిశయముల నుదువ

నొప్పునని తొలుతనే వచియించితిమి. ఆగుణవిశేషములలో నొక్కటియగు విక్రమమే యీనగరనామోత్పత్తికిఁ గారణము. విక్రమసింహాపురపాలకులగు భూధవులకును విక్రమసింహాపుర నివాసులగు ప్రజలకును నామాత్మగర్వసంచితము. ఆవిక్రమము సన్మార్గవర్తనపూర్వకము. అధర్మఖండనమూలము. తాదృశవిక్రమమే యీనగరి కీనామధేయమును గూర్చినది.

అన్యగుణవిశేషము సాంఘికాచారసంస్కరణము. చిరకాలముక్రింద స్వప్నముననైన నెవ్వఁడును విని కని యెఱుంగని యాచారాంతరము లనుభవదృశ్యములయ్యె. తొలుతటి యకారణపాతకములు వెనుకంజ వైవసాగె. అభినవాభిప్రాయంబులు సంఘసమ్మతములుగ ననేకవిషయముల నలరారె. కాని సుజనమార్గములకు విఘాతముల కారణసిద్ధము లగుటం జేసియు విజయోన్ముఖులగు నూత్నసంస్కారుల కాతంకములయునికిం జేసియు గాలయాపనము సంఘటిల్లు. అగుగాక, పరిశ్రమానంతరవిజయప్రాప్తియే సర్వజనసమాదరణీయము. అదియే యశస్కరము. అయ్యదియే విక్రమసింహానగరవాసుల ప్రయత్నమార్గమగుటం జేసి వారిచరితమున మనకుఁ దెల్లము గాఁగలదు.

చిరకాలమునుండి యారంభోన్ముఖులయి సింహాపురనివాసు లిప్పటి కెట్లు సామాన్యాభివృద్ధి గాంచిరో యట్లే యిది మొదలు సంస్కారోద్యమముంగొని కాలక్రమమున ననంత శ్రేయోభివృద్ధి గాంతురు గాత మని మాయభిలాష.

---

# సుజనమైత్రి

## రెండవ ప్రకరణము.

---

విజయారంభము.

ఒకనాఁడు త్రిజగద్వ్యాపియగుసూర్యభగవానుఁడు ప్రజాపరిశ్రమ శూన్యతం గని కోపారుణితమూర్తియై యరుణకిరణంబుల నలుదెసలఁ జిమ్ముచుఁ దూర్పుదెసనుండి బయలుదేరి వచ్చుచుండెను. నైష్ఠికజనులు ప్రాతఃకాలానుష్ఠానములఁ దీర్చి తమ తమ వ్యాయామములకడ కేగుచుండిరి. పశుగణంబులు తమ నెలవులనుండి విడువంబడి మెల్లమెల్లన సూర్యకిరణస్ఫురణంబునకు సంతసిల్లుచుఁ బొలముల కేగుచుండెను. కొలఁది దూరమున నుండు జనపదములనుండి పాలు, పెరుగు, కూరగాయలు మున్నగుపదార్థముల మోసికొనివచ్చు స్త్రీపురుషులు వీథులయందుఁ దిరుగాడుచుఁ గేకలు వైవసాగిరి. ఎల్లవీథులయందుఁ బ్రజాకలకలంబులు విస్తరిల్లె. సింహపురి బ్రాహ్మణవీథియం దొకబాలుఁ డుత్తరదిశాభిముఖుండై మెల్లగ నరుగుచుండె. ఆబాలున కించుమించు పదునారేండ్లప్రాయ ముండును. అతనికి హృదయంగమంబగు వదనబింబంబును, విశాలమగు వక్షస్థలంబును దనరు. పసిమిమై నలరారు మేనిచాయయు, వెడదయగు కన్నుంగవయు నలరు. ఈసుందరపురుషుఁ డెద్దియో చింతించుచున్నవానివలెఁ

గన్పట్టుచు నల్లనల్ల నటునిటు నడయాడుచుండెను. చిఱుతలుగ ఖండింపఁబడి చక్కని పాపటచే విడఁదీయఁబడియున్న యాతని ముంగురులు పాలగాడ్పులఁ జిందరవందరయై మొగంబున మురువుగూర్చుచుండెను. తెల్లనివలువలు ధరించి కఱకైనయంగీలం దొడఁగి, పాదంబుల మోజాలంగూర్చి, యొకచేత నాతపత్రమునుం గొని, సాలోచనవదనుండై యరుగుచున్న యీ బాలుని గమనమతి మనోజ్ఞముగ నుండెను. అతఁడు కొంతతడ వా వీథిని జనిచని తుదకొకభవనద్వారమున నిలువంబడెను. తద్భవనంబు ప్రాగ్దిశాముఖంబై యుండుటం జేసి, తరణికిరణముల నరుణితంబై ప్రజ్వరిల్లుచుండెను. నవసుధాపూతమై కైలాసగిరిం బోలిన యాసౌధరాజంబు నూతననిర్మితముగాఁ గాననయ్యెడిని. విశాలములగు గవాక్షములు మూయుటకై వివిధవర్ణములైన యద్దంపుదలుపు లమర్పఁబడియుండె. చిత్రవిచిత్రములగు చిత్తరువు లామేడపై నచ్చటచ్చటఁ జిత్రింపఁబడియె. ద్వారమున కిరుదెసల లక్ష్మీవిగ్రహములు విరాజిల్లుచుండెను. ఆవిగ్రహముల యునికిం జేసి యీ సౌధము కలుములజవరాలికి నిలయంబో యనుమాడ్కి విలసిల్లుచుండె. ఆబాలుం డిది యొక మహాధనికుని యావాసంబని యూహసేసె.

ఆబాలుం డాసదనద్వారమున నిలువంబడి వాకిట నిలువంబడియున్న పరిచారకునిం గనుంగొని యజమానుఁ డింటనుంటనెఱిఁగి యెవరో చూడవచ్చియున్నారని నుడువు మనెను. పరిచారకుఁ డంత లోనికిం జని మగుడివచ్చి యాపురుషుని లో

నున్న గదిలోనికిం జనుమని చెప్పెను. ఆగది మిగుల విశాలము గను దర్శనీయముగను నొప్పుచుండెను. అందు నలుదెసల ననేక పుస్తకభాండంబులు నమరియుండె. బాలుండు తదంతఃప్రదేశము నకుఁ జనువేళ నిరువురు పురుషులు సుఖాసనాసీనులై యుండిరి. వారిలో నొకండు నలువదియైదువర్షములు పైబడినవాఁడు. గంభీరవదనమును గురుకాయమును గలిగియున్నవాఁడు. ఒక చేతఁ గొన్ని కాగితములు గలిగియున్నవాఁడు. రెండవవాఁడు ముప్పదివర్షములకు లోనైనవాఁడు. అతఁడు సువర్ణఘటికాయం త్రములం గలిగి చక్కని జరీపరిధానముం దాల్చి ధనికుఁడుగఁ గన్పట్టుచుండెను. ప్రథమపురుషుఁడు సింహాపురమునంగల న్యా యవాదిబృందమునకెల్లఁ బెద్దయై యనేకవర్షములనుండి యపార ధనము నార్జించినాఁడు. అతనిచెంతం గూరుచుండిన ద్వితీయపురు షుండు సింహాపురంబునఁ గాపురమున్న యొకానొక భూస్వామి. వీరిరువురకును ననతిదూరమున నిరువురు లేఖకులు క్రిందఁ గూర్చుండి యెద్దియో లిఖించుచుండిరి.

పైఁజెప్పిన బాలకుఁడు గదిలోనికిం జనువేళ వారిటుల మాటాడుకొనుచుండిరి.

ప్ర.—నీవ్యవహారము విషయమై యెంతయు నాలోచించితిని. ఎంతచూచినను నేమియు నాధారము కనఁబడదయ్యె.

ద్వి.—అయ్యో! యితరు లెవ్వరివలనను గాదనిగదా మీచెంతఁ జేరితిని. ఈవ్యవహారమున నెంతధనంబయిన వ్యయంబవుగాక.

మీకు వలయునంతధన మిచ్చుటకు సిద్ధముగా నున్నాఁడను. నాకు జయవాక్యము వినిపించుమార్గము నూహింతురుగాక.

ప్ర.—కేవల మాధారహీనమైన వ్యవహారమున నెంతధనము వ్రయపెట్టిన నేమిప్రయోజనము? అయ్యా! మీరు మఱల సాయంకాలము రండు ఆలోచించెదను.

ద్వి.—అయ్యా నమస్కారము సెలవొసంగుఁడు. అని నిష్క్రమింపఁ బ్రథమపురుషుఁడును గృహాంతర్వర్తి జనాహ్వాయమానుండై లోనికిం బ్రవేశించె. బాలుఁడును బ్రథమపురుష పునర్దర్శనమునకై నిరీక్షించుచు నందె కూరుచుండెను.

---

# సుజనమైత్రి

## మూఁడవ ప్రకరణము.

---

### దురవస్థ.

ఒకనాఁటి సాయంకాలమునఁ జిన్నిరాయనిపురం బను నొక జానపదంబున నొకానొక వేశ్యాగృహంబుచెంగట నొక వితంతు విట్లు విలపింపసాగెను. "అయ్యో! నే నెంత పాపకర్మురాలను? ఎంత దురదృష్టవంతురాలను? ప్రొద్దున నిద్ర లేచినది మొదలు సూర్యాస్తమయమువఱకు నొరులకు జంకియే సంచరింపవలయునుగదా? ఎవ రేకార్యమునఁ బోవుచు "నీవెదురుగ వచ్చితివి. ఈకార్యము నిరర్థకమయ్యె" నని తూలనాడెదరో అని భీతిచెందవలయును. ప్రొద్దుప్రొద్దున నిద్దురలేచి సెజ్జవీడి, ఎవరు నన్నరసి "అమ్మా ప్రొద్దుననె యెదురుగ రావలయునా? నీ మొగము చూచుటంబట్టి యీనాఁడెట్టి నష్టములోకదా?" యని దూఱెదరే అని కొంతభయము. తోడియాడువారలతోడ రంగులచీరలను రవికలను దొడిగికొని, తిలకమ్ము దిద్దికొని నేను మాత్ర మేల సంచరింపరాదు? వీని కేమి? అకటా యిఁక నా కుపాధియేమి? ఎవ్వరిపజ్జ చేరుదును? దుర్నయమునకుఁ బాలుపడి యెట్లో కాలముపుచ్చుదమన నీదురవస్థయేమి? ఈబాలికయేమి? పోయినభర్త రానేరఁడు. వచ్చినవైధవ్యము పోనేరదు.

గానున్నది కాకపోదు. ఈబాలిక శోకమగనిఁగూర్చి యాతని పాపాయ్యమున జీవనము సేయుదునా? ఎవఁడు గ్రహించును? విధవాపుత్త్రికగదా! ఈబాలిక యెవ్వతెయన్న నే నేమి చెప్పఁ దును? కన్యప్రాయ మెంత యని యడుగుట సహజము. తండ్రి పోయి యెంతకాలమైనదని యడుగుటయు సహజము. భర్త్ర మరణకాలమును బుత్త్రికా జననకాలమునుబోల్చి సరిచూచిరేని యపు డప్రతిష్ఠపాలుగానా? భర్త్రమరణకాలవిషయమై బొం కాడవచ్చునుగాని ద్వితీయ వివాహవిషయము తప్పించుకొను టెట్లు? నిజము నుడువక తప్పదు. ఈబాలిక కిప్పుడే వివాహము సేయుదునా? ఈ వయస్సునఁ బరిణయమాడి తత్ఫలమ్ముగ ననుభ వించుచున్న యీదురవస్థ నాబిడ్డకుఁగూడ నలవడవలయునా? అమ్మా శారదా! నీముద్దుమురిపెములుచూచి యానందించు భాగ్యము నాకు లేదుకదా!” అని పలురీతుల విచారించు నొక వితంతువును దదుత్సం గోపవిష్ట యగు నొకబాలికను నొక భోగాంగన గాంచె. ఆమె దీనాలాపంబుల నించుక వినియుండు టచే భోగాంగన యామెపైఁ గరుణించి యిట్లు సంభాషింపఁ జొచ్చెను.

భో.—అమ్మా మీా దేదేశము?

వి.—ఇచటి కనతిదూరమే!

భో.—ఇచటి కేల వచ్చితిరి? మీాతావును విడువ హేతువేమి?

వి.—ఏమని చెప్పుదును? నేనుబడినపాట్లును నాకు ఘటిల్లిన

యీమదవస్థలును నొరులతోఁ జెప్పుకొనవలయునా? పొంది దిన యపయశస్సు చాలదా?

భో.—అమ్మా! నిర్విచారముగాఁ జెప్పుము. నన్ను వేరువిధముగా నూహింపకుము.

వి.—నే నీప్రాంతమునఁ గీర్తివహించిన యొక సోమయాజి కూఁతురను. కాలక్రమమునుబట్టియు, నాచారధర్మములను బట్టియు దేశస్థితినిబట్టియు సోమయాజియగు మాతండ్రి గారు నాకైదవయేటనే నన్నుఁ బరిపూర్ణవిద్యావంతుఁడగు నొక యవధానిగారి కిచ్చి వివాహము చేసిరి.

భో.—వివాహసమయమున నీభర్తయందు నీకేమైన ననురాగ ముండెడిదా!

వి.—వారెవరో నాకప్పు డేమియుఁ దెలియదు. నే నమ్మగారి యండఁజూచుకొని యాయన కెడమచేతివైపునఁ గూరుచుండెడిదానను.

భో.—అప్పటి కాయన ప్రాయమెంత?

వి.—నూటికిఁ బదేండ్లుతక్కువ ప్రాయమువారు!

భో.—తరువాత నీభర్త యెంతకాలము జీవించెను?

వి.—ఎంతకాల మెక్కడిదితల్లీ! ఆసంవత్సరము గడువలేదు.

భో.—రామరామ! ఎంతమాట! అట్లయిన నీబాలిక యెవ్వతె?

వి.—నాపుత్త్రిక.

భో.—ఎట్లు ?

వి.—తగుప్రాయము వడి జ్ఞానవతినైనంతపిదప మరల స్వయంవరము చేసికొంటిని. ద్వితీయధవునకే యీపుత్త్రిక జనియించినది.

భో.—తరువాత ?

వి.—నా ద్వితీయభర్తయుఁ గొలదికాలముక్రింద గతించె. అప్పుడు నేనేదైన నొకపుణ్యక్షేత్రమున నుండి దైవభక్తిచేఁ గాలము గడుపవలయు ననునుద్దేశము నొందితిని.

భో.—అట్లయిన నీబాలిక నేమిచేసెదవు ?

వి.—అదియే నావిచారము. ఎవ్వరైనఁ గావలెనని పెంచుకొనునెడల వారికిచ్చెదను.

భో.—అట్లయిన నీయూర నొక వేశ్యాంగన గలదు. దానిపేరు "కోకిల" దానికి సంతతిలేదు. పిల్లలఁ జూచినప్పుడు కడుంగడు ముచ్చటపడుచుండును. ఈబాలిక నావేశ్య కొసంగితివేని నీయభీష్టము నెరవేరును.

వి.—ఆమె యెచ్చట నున్నది ?

భో.—ఇచ్చటనే !

వి.—ఆమెను నాకిపుడు చూపఁగలవా ? ఆమె యెట్లుండును ?

భో.—ఆమెను నీవిప్పుడు చూచుచునే యుంటివి. నావలెనే యుండును.

వి.—నీమాటలనుబట్టిచూడ నీవే ఆమె యని తోఁచుచున్నది.

భో.—నేనేయైన నాకొసంగెదవా ?

వి.—ఒసంగ కేమి? అనురాగమునఁ బెంచి పెద్దదానిని జేయ వలెనుగాని యెవ్వరైననేమి?

ఇట్లు భోగాంగన యావితంతువుతో మరికొంత ప్రసంగించి శారదయను బాలికను బోషణార్థమై గ్రహించి తదుపాంతమున నున్న తనగేమునకుం గొనిపోయి యానాఁడు మొదలుగ నత్యనురాగంబునం బెంచుచుండె. వితంతువును నిజాభిలాష నెఱవేర్చుకొనుటకై యాత్రానిర్గమనాలోచనము చేయుచు నరుగుదెంచెను.

---

# సుజనమైత్రి

## నాలుగవ ప్రకరణము.

---

### నిరాదరణ.

న్యాయవాది.—అయ్యా మీ రెవరు?

బాలకుఁడు—నేను విక్రమసింహపురవాసుఁడను.

న్యా.—మీ యాగమనకారణ మేమి? మీ రేమి చదువు చుంటిరి?

బా.—నేను క్రొత్తగ ప్రవేశపరీక్షలో నుత్తీర్ణుఁడనైతిని.

నాతండ్రి బాల్యమునందే గతించెను. అప్పటినుండి నా తల్లి నాకున్న కొలఁది జీవనముచే నన్నుఁ బోషించి యింతవఱకుఁ జదువు చెప్పించెను. దైవసాహాయ్యమునఁ బ్రవేశపరీక్షలో నేను మొదటితరగతిలో నుత్తీర్ణుడనయితిని. ఇఁక విశ్వవిద్యాలయముం జేర వాంఛ మెండుగ నుండుటం జేసి తమ సహాయ్యము వేఁడ వచ్చితిని. ఇదియే నావృత్తాంతము.

న్యా.—ప్రవేశపరీక్షావిజయాపాదివైనను మీకు మర్యాదలు తెలిసినట్టు కనపడదే? కాలిజోడునుం దీయకయే నాగది లోనికి రావచ్చునా?

బా.—అయ్యా! పొరపాటు క్షమింపుఁడు. అనుచు నావలి కరిగి పాదరక్షల నప్పుడు విడిచి తిరిగి ప్రవేశించెను.

న్యా.—మంచిది. మీ రేవర్ణస్థులు ?

బా.—అయ్యా! నేను బ్రాహ్మణుఁడను.

న్యా.—బ్రాహ్మణుఁడవా ? ఇట్టి బ్రాహ్మణులునుం గలరా ?

బా.—అయ్యా! అట్లనెద రేమి ?

న్యా.—(కోపముతో) ఓహో! నీకుఁ గారణములు తెలుపవలెనా ? ఇటువినుము. నీవేషము, నీబోడితల, నీయునికి, నీచర్య పినింజూడఁ గేవలము క్రైస్తవుఁడవుగ నగపడుచున్నావు. కాని బ్రాహ్మణుఁడవుగఁ గనుపడుటలేదు. ఎద్దియేని యించుక యాంగ్లేయవిద్య నభ్యసించఁగనే గర్వాంధులై కులధర్మముల మాని త్రుళ్లిపడుహీనులమోముల నేఁ జూడనోప.

ఈ పరుష వాక్యముల వినినంతనే బాలకుఁడు భరింపరాని యాగ్రహమున నిట్లనెను.

బా.—అయ్యా! వినుఁడు. బ్రాహ్మణునకైనను జండాలునకైనను గుణము ప్రధానము గాని వేషమునం దేమియులేదు. గుణహీనుఁడు బ్రాహ్మణగర్భజనితుఁడయినను జండాలమాత్రుఁడే. విద్యార్థినై తమ సాహాయ్యము వేఁడవచ్చితినిగాని నన్ను ధనమదంబున జండాలతుల్యునిఁజేతురని తొలుత యెఱుంగనైతి. ధనార్జనకై యెట్టిపాటులయినఁ బడవలయు.

న్యా.—దుష్టా! నాయింటికివచ్చి నన్ను నిందింపఁజూచెదవా? బిచ్చమునకై వచ్చిన నీకా యింత పొగరు? ఈక్షణమున నాయిల్లు వెడలుము. ఈమాటలు వినినంత నాతనిచెంతనున్న యిరువురుపరిచారకులు బాలకునిఁ బరుషముగా నిలువెడలుమనిరి.

బా.—నిష్కారణముగ నన్నవమానించితిరి. ఇది జ్ఞప్తినుంచుకొనుఁడు. మిమ్ము నేను నిందింపలేదు. నాకు సాహాయ్యము నేయకుండుటయేగాక యకారణముగ నిందించి నన్నిల్లువెడల నాజ్ఞాపించితిరి. ఈవిషయము మరువకుఁడు అనుచుఁ బరాఙ్ముఖుఁడై యాభవనమువిడిచి యేగెను.



# సుజనమైత్రి

## ఐదవ ప్రకరణము.

---

వరాన్వేషణము.

వే.ఉ.—సతీ! రాజసా! మనకమలకుఁ బ్రాయమెంత?

రాజస.—ప్రాణేశ్వరా! మన ముద్దులపట్టి కిప్పుడు పండ్రెండవ సంవత్సరము

వే.—అట్లయిన వివాహప్రయత్నము సేయవలసినదే.

రా.—సౌందర్యవతియుఁ, జతురమతియునైన మనకమలకుఁ దగిన వరునిమాత్ర మాలోచింపుఁడు.

వే.—సదాచారపరాయణుఁడును వేదవిద్యాధురీణుఁడును నగు రామావధాని పుత్త్రుఁడు సోమావధాని కీయవలెనని నా తలంపు.

రా.—అయ్యో! ఎవరైన నాంగ్లేయవిద్యాధురీణుఁడగు నల్లుని యాలోచింపక యిట్టి విద్యావతియు, గుణవతియు, సుందరవతియు నగు ముద్దులపట్టిని బ్రాహ్మణార్థములకై యెండ యనక వానయనక యూరుం బల్లెలఁ ద్రిమ్మరు నొకచాందసుని కివ్వఁదలంచితిరా?

వే.—అదియేమి? వేదవిద్య నీబుద్ధికి విద్యగా నగపడలేదా?

రా.—నాయభిప్రాయము వేదవిద్య గర్హితమని గాదు. మన కమల క్రైస్తవస్థాపితమైనబాలికాపాఠశాలకుఁ బోవుచున్నది. ఆంధ్రభాషం గొంత పఠించినది. ఆంగ్లేయభాషయుఁ జక్కఁగా నేర్చినది. శ్లాఘ్యములగు ననేక నూతనాభిప్రాయములను గడించినది. అట్టి బాలికకు సముచితవిద్యాధురీణుఁడు కావలెనని నాయాశయము. లేనిచోఁ గాకిముక్కునకు దొండపండు గట్టినట్లుండును. అదియంతయు నేల? ఆంగ్ల విద్యాభ్యస్తయగు నీబాలిక నతఁడు దఱిఁజేరనిచ్చునా? ఇందుల కతఁ డీయకొనునా?

వే.—పోనిమ్ము. ఎవని కీయవలెనని నీతలంపు?

రా.—విక్రమసింహపురమున సుందరుఁడను నొకవిద్యార్థి కలఁడు. అతఁడు పదునారేండ్లప్రాయమువాఁడు. పున్నమనాఁటి జాబిల్లివెన్నెలల మిసిమియాఱఁ జిఱునవ్వున మెలంగుచు నొకప్పుడేని క్రోధాద్యరిషడ్వర్గముల దూఱువాఁడు. గుణశాలి. ఆంగ్లేయభాషలోఁ బ్రవేశపరీక్షలో సుత్తీర్ణుఁడయినవాఁడు. విశ్వవిద్యాలయప్రవేశమునఁ బ్రయత్నించుచున్నవాఁడు. అతఁడు మనకుమారితకుఁ దగువరుండని యూహించెద.

వే.—అతఁడా? నిన్న నన్ను సందర్శింపవచ్చినవాఁడా?

రా.—ఏమో అది నేనెఱుంగను.

వే.—బోడితలగల బాలునిమాటయేగదా నీవు చెప్పునది?

రా.—అవును. అతనితల సగము గత్తిరించి పాపటగలిగి యుండును.

వే.—అతని వేషభాషలు నాకేమియు నచ్చలేదు. అతని బోడి తలయు నతని సంభాషణవైఖరియు నాకేమియు సమ్మతముగ లేవు.

రా.—అదియంతయు నాకేమి తెలియును?

ఊరివారందఱు వానిం బొగడుచుండ సన్మార్గుఁడని యెంచితిని. వాని ననేక పర్యాయములు చూచియుంటిని. అతిసుందర మూర్తి. సౌందర్యమునుబట్టియే యతనికి సుందరుఁడని నామకరణము సేసిరని విననోపు.

వే.—వినను గమల యభిప్రాయముగూడఁ గనుఁగొనుము.

కమలా! బోడితలయు మాలవేషమును నీకంత యందగించునా?

అయ్యెడఁ గమల తాఁ జదువుచున్న పుస్తకమును క్రింద విడచి చిఱునగవుతోఁ దండ్రి కిట్లనెను.

నాయనా! వేషమువలననా గుణములు చర్చించునది? కాలానుసారముగ మనయభ్యాసములయందును నాచారముల యందును వివిధములగు మార్పులగుచున్నవి. మన మిపుడు ధరించునది మన పూర్వీకులవేషమేనా?

వే.—"తులువా! నీవా నాకెదురాడునది? అవును చిన్ననాఁట నుండియు నీయిష్టముచొప్పునఁ బోనిచ్చినందుల కు ఫల

మిప్పుడు కాన్పించుచున్నది.” అని భరింపరాని కోపమునc బట్టిం గనుంగొని “కమల పాఠశాలకుc బోవుట యిcక మానవలయును. వ్యవహారము మీఱివచ్చుచున్నది. అల వడినవిద్య చాలును” అనిచెప్పెను. పదంపడి ముప్వురును లేచిరి. వేణుగోపాలశర్మ భోజనముచేసి యతిశీఘ్రముగ న్యాయస్థానమున కరుగుదెంచెను. కమలయుc గమలా జనని యగు రాజసయు నసంతృప్తికరముగ నేదియో యాలోచించు కొనుచుండిరి.



# సుజనమైత్రి

## ఆఱవ ప్రకరణము.

---

ఆ ప క ణ.

సుందరునకుఁ బ్రపంచానుభవ మెక్కుడుగ లేదనువిషయము తదీయవయోవిశేషమునుబట్టియే చదువరులు గ్రహించియుందురు. అల్పవయోవిశేషమేగాక శైశవమాదిగ విద్యాభ్యాసముదక్క వేఱొండు ప్రవృత్తిలేమింజేసి ప్రపంచానుభవ మెక్కుడుగలేకున్నను సుందరుఁడు సూక్ష్మగ్రాహి కాకపోలేదు. దీర్ఘాలోచనపరుఁడును గాకపోలేదు. సదా సన్మార్గప్రవర్తనాసక్తుఁడును, నొరుల నకారణంబుగ నొవ్వంజేయనివాఁడును నయినను, దన్నొరులు నొప్పించునెడ సహించువాఁడుగాఁడు. నాఁడు న్యాయవాది గోపాలశర్మ తనకుం గావించిన పరాభవంబున కెంతయుఁ జింతిలుచు సుందరుఁ డిలుసేరెను. అతఁడు చిన్నతనముననే తనజనకుని గోల్పోవుటంజేసి జననియే యాతనిం బెంచుచుండెను. ఆయమ కించుమించు ముప్పదియేండ్లుండును. ఆయమపేరు రాజ్యలక్ష్మి. భర్త చనిపోవునప్పు డాయమ బాల్యమునం దున్నప్పటికిని నధైర్యపడక యుపాయముగ భర్తయిడిన కొలఁది భూజీవనమువలనఁ గాపురముసేయుచుఁ గుమారునకు విద్యగఱపించెను.

సుందరుఁడును మిగుల సమర్థతతోఁ జదువులనెల్ల నేర్చుచుఁ బరీక్షలయం దెంతయు నౌన్నత్యము నాపాదించుచుండెను. ప్రవేశపరీక్షయందు మొదటితరగతిలోఁ గృతార్థుఁడయిన విషయము వినినంతనె తల్లి యపరిమితానందంబువడసెను. సుందరునకు విద్య సంపూర్ణముసేయు నుపాయమేమియుఁ దోఁపమింజేసి యాలోచన మెండయ్యెను. తనకున్న యాస్తి కొలఁదిదైయినందున విశ్వవిద్యాలయప్రవేశమునకుఁ జాలదని యాతనికిఁ దెలియును. కావుననే యతఁడు తల్లికిఁ జెప్పకయే వేణుగోపాలశర్మ నాశ్రయించెను.

అయ్యెడఁ దల్లియుఁ గుమారుని దీనవదనముం గాంచి యాతని కెద్దియో యిక్కట్టు గలిగిన దని తలంచి "నాయనా! యేల దుఃఖించెదవు?" అని యడిగెను. అందులకు సుందరుఁ డేమియు బదులుసెప్పక నిలువంబడియుండుటంజూచి తల్లి గన్నీరుగార్చుచు మరల మరల నడుగుటయు సుందరుఁ డిట్లు ప్రత్యుత్తరము చెప్పుటయు నయ్యె.

"అమ్మా! నే నీయుదయమున న్యాయవాదియగు గోపాలశర్మకడకు సహాయార్థమై యరుగ నన్నతఁడు బోడితలవాఁడవనియుఁ, గ్రైస్తవుఁడవనియుఁ దూలనాడి పరిభవించెను.

తగునాలోచనముసేయక నామూఢు నాశ్రయించిన నాబుద్ధిహీనతకు నేనెంతయుఁ జింతిల్లుచున్నాఁడను."

రాజ్య.—నాయనా! యీవిషయమున నీవంత చింతింపఁబని

లేదు. మనకున్న యాస్తియంతయు నీయదియేగదా ఆయాస్తి యంతయు నీవిద్యకై వినియోగించుకొనుము.

సుం.—అమ్మా! నీ వెట్టివెఱ్ఱివి! మనయాస్తి విక్రయించిన నెంత కాలము రాగలదు? ఆవెనుక నీవెట్లు జీవించెదవు?

రాజ్య.—నాయనా! నేనెటులనైన జీవించెదను. నీకు విద్య సంపూర్ణమగునంతవరకు నెచటనైనఁ గష్టించి.—

సుం.—ఎంతమాట! అమ్మా, నీవు కూటికిఁ గష్టపడుచుండ నే విద్యకుఁ బోవలెనా? అట్టివిద్య లేకున్న నేమి? ఇంత కాలము నాకొరకై నీవుపడినయిడుములు నేనెఱుఁగనా? ఇకఁ గూటికిని గష్టపడవలెనా? చాలును. ఇట్టి కర్ణకఠోరవాక్యములు నేను వినఁజాలను.

వీరిరువురు నిటుల చింతాక్రాంతులై సంభాషించుచుండఁ జటాలున నింటిలోని కొకపురుషుఁడు ప్రవేశించెను.

---

# సుజనమైత్రి

## ఏడవ ప్రకరణము.

---

### పుత్రప్రేమ.

వేణుగోపాలశర్మ న్యాయస్థానమునఁ దనవ్యవహారముల నవలోకించుకొను తఱి నొకరాజసేవకుఁడు సమీపించి యొక తంతివార్తనందజేసె. నిచ్చెను. తత్తఱపాటుతో న్యాయవాది యది విప్పి యాంద్రీకరించుకొని యిట్లు చదువసాగెను.

"ఏడను నగరము.
విష్ణుశర్మ వద్దనుండి
వేణుగోపాలశర్మకు.

సింహపురము. దక్షిణహిందూస్థానము. ఆంగ్లేయదేశమునకుఁ బ్రయాణమున నున్నవాఁడను. ప్రయాణానంతరము సావధానముగ వ్రాసెదను. క్షమింపవలయును." ఈవార్తలఁ జూచుకొని న్యాయవాది దిగ్భ్రమనొందెను. విష్ణుశర్మ ఇరువది యేండ్ల ప్రాయమువాఁడు. ఇతఁడు కొంతకాలము రాజధానియందు విశ్వవిద్యాలయమునందు గడపి యచ్చట నొకటిరెండు పరీక్షలయందు విజయమంది తండ్రి వలదన్నను వినక వైద్యశశాలాయందుఁ బ్రవేశించెను. అచ్చట రెండువర్షములనుండి

చదువుచుండెను. ఆంగ్లేయదేశమునకుం జని యచటి వైద్యవిద్యం బరిపూర్ణముసేసి గొప్పరాజకీయోద్యోగము నాపాదింపవలెనని యాతనియభిలాష. కాని తండ్రి యాతని యభీష్టమున కియ్యకొనఁడని స్పష్టముగ నతనికిఁ దెలియును. కావున దండ్రికిఁ దెలియకుండఁగనే తల్లికి వ్రాసి తనవ్యయమునకుఁ గావలెనని కొంత ధనము తెప్పించుకొని తన యొద్దనున్న కొన్నియాభరణములు నమ్మి యాసొమ్ముతోఁ బ్రయాణమునకు సాహసించెను. కుమారుఁడు దేశాంతరగతుఁ డయ్యె నన్నవార్త జనకుఁ డిలుసేరి సెప్పఁగనే జననియు మిగుల శోకించె. అపుడు తెలియక కొంతధనము కుమారునకుఁ బంపిన విషయమును విన్నవించెను. న్యాయవాదియు నీవార్త విని "నావంశమంతయు నీదుర్మార్గనిజననమున దురాచారనిలయంబైనది. నేనతని కొక కాసైనను నొసంగఁజాలను. వానికిని నాకును నేఁటితో ఋణముతీఱినది" అనెను. ఎంతకోపించినను బుత్త్రప్రేమ నిస్సారముగాదుగదా! క్రమక్రమముగ న్యాయవాది కోపము శోకముగ మారెను. జననీజనకు లిరువురు పెద్దకాలము చింతసేసిరి. ఎట్టకేలకు నాతనిపై ననురాగము సమయింపఁజాలక వారాతనివ్యయమునకై కావలసినధన మంఘ్రనంగీకరించిరి.

---

# సుజనమైత్రి

## ఎనిమిదవప్రకరణము.

---

### బడిచెలిమి బలిమి.

సుందరుఁడు ప్రవేశపరీక్షావిజయమునకై ప్రయత్నించు వేళ నతనికి మదనుఁడను నొక సహాధ్యాయి కలఁడు. చిన్ననాఁట నుండియు వీరిరువురు నొక్కటిగ విద్య నేర్చుకొనుచుండిరి. అందువలన వీరికిఁ బరస్పరానురాగము మెండై యుండెను వీరిరువురును సమవయస్కులు. మదనుఁడు సింహపురీనగరమునకు ననతిదూరముననున్న చిన్నరాయపురంబను జనపదంబున నుండు నొక గొప్పభూస్వామి పుత్త్రుఁడు. ఇతనితండ్రి యితని నతిబాల్యము నందె విద్య నేర్పించుటకొరకు సింహానగరమునకుఁ బంపెను. అప్పటినుండియు నితఁడును సుందరుఁడును నొకే విద్యాలయమునఁ జదువుచుండిరి. ప్రవేశపరీక్షయందు వీరిరువురు నొక సంవత్సరమునఁ గృతార్థులైరి. పరీక్షకుఁ గొన్నిరోజులకుఁ బూర్వమె యితని తండ్రి యాకస్మికముగఁ గాలధర్మమునొందె. ఇతఁడు ప్రవేశపరీక్షయందుఁ గృతార్థుఁడయ్యు నింటఁ దనవ్యవహారములఁ జూచుసహాకారి లేమిం జేసి యతిదుఃఖమున విశ్వవిద్యాలయమునకుఁ బోవుప్రయత్నము మానుకొనెను. సుందరుఁడును రాజ్యలక్ష్మియు సంభాషించుకొనువేళ నరిగిన మనుజుఁడీమదనుఁడే. మిత్రుని జూచినపుడు సుందరుఁడు తనవిషాదమును మ్రింగి నవ్వుచు నిట్లు ప్రసంగించెను.

"మదనా రమ్ము కూర్చుండుము!"

"సుందరా! ఏమి యిది నీమొగమంతయు వాఁడి యున్నది! ఈవిషాదమునకుఁ గారణమేమి?"

"ఎన్నిటికైనను లేమిడియే కారణము ఆహా! ఆహా! దారిద్ర్యము శాపమేకదా!"

"ఈవిషయమున భావభేదములున్నవి. నీకిపుడు కలిగినకష్ట మెయ్యది?" పదంపడి రాజ్యలక్ష్మి యాదినమున జరిగినవృత్తాంత మంతయు మదనునకుఁ జెప్పెను. అతఁడదియెల్ల సావధానముగ విని "మిత్రమా! నీవీవిషయమున నేదియుఁ జింతింపనక్కఱలేదు. నిన్ను నేను గుర్తెరింగినదాదిగ సహోదరభావమునఁ జూచితిని గాని వేరొండుగాదు. రాజధానికిఁ బొమ్ము. విశ్వవిద్యాలయ మునం జేరుము. నీకయ్యెడి ధనవ్యయమంతయు నే భరించెదను. ఇట్లుచెప్పి సుందరుని కౌఁగిలించికొన నతఁడు తలవాల్చి కృత జ్ఞతాపూర్వకముగ నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

"మిత్రమా! నీయౌదార్యమున కెంతయు నమస్క రించెదను. భూమ్యాకాశములును, సూర్యచంద్రులును, నాజన నియు సాక్షిగ నేఁజెప్పునది వినుము. నాకు విద్యాభ్యాస కార ణుఁడ వగుటచే నీవే తండ్రివి. నీవే తోడువు. ఏకాలమునకైన నీవు నాకుఁ జేసెడి మేలునకుఁ బ్రతిసేయుశక్తియు నవకాశమును గలుగఁజేయఁగలందులకై భగవంతునిఁ బ్రార్థించెదను."

పిమ్మట రాజ్యలక్ష్మీసుందరులచే దీవనలంది మదనుఁడు నిజ పురమునకుం జనెను. కొలఁదికాలముననే సుందరుఁడు రాజ ధానికిం జని విశ్వవిద్యాలయమునఁ బ్రవేశించెను.

---

# సుజనమైత్రి

## తొమ్మిదవ ప్రకరణము.

---

### దీనజనరక్షణము.

"అయ్యో! అయ్యో! రక్షింపుఁడు. రక్షింపుఁడు."

"ఛీ! మాలముండకొడుకా! నాదగ్గరనా టక్కులు? నాఋణ మీక్షణమునఁ దీర్పుము. లేనిచోఁ బనికి రమ్ము. అంత దనుక నేను నిన్ను విడువను."

"మహాప్రభూ! నేను బానిసవాఁడను. నీచాకిరిచేయు వాఁడను. ఈస్థితియందున్న నన్ను శ్రమపెట్టిన నేను జత్తును. నాయందుఁ గరుణయుంచి నన్ను మన్నింపుఁడు."

"ఛీ! పశువా! గాడిద! [అని రెండుగ్రుద్దులు గ్రుద్దెను.]"

"అయ్యో! చచ్చితి. అయ్యో! చచ్చితి!"

"అయ్యో! మాయయ్యను గొట్టుచున్నారు. మాయ య్యను జంపుచున్నారు." "బాబూ చంపఁబోకుఁడు. ప్రాణముతో వదలుఁడు. మీఋణము తీర్చుకొనియెదము. నామగని వదలుఁడు మీకాలు మ్రొక్కెదము." ఈతెఱంగునఁ బ్రసంగమును రోదన ధ్వనియు నొకగృహమునుండి వెలువడ నప్పు డొకయువకుఁడు హాయావరోహణము గావించి తటాలున నిలుసొచ్చెను. రక్తా

క్షుడును దీర్ఘకాయుఁడును నగు నొకతరుణవయస్కుఁ డొక మాలని జుట్టు చేఁ బట్టిలాగుచుఁ గొట్టుచుండెను. ఆమాలఁడు క్రిందఁబడి వడఁకుచుండెను. అతఁడు తుదకు రెండుచేతులను జోడించి "రక్షింపుఁడు, రక్షింపుఁడు," అని యార్తనాదమున నెలుగెత్తి యేడ్చుచుండెను. చెంతనున్న బాలుఁడు తల్లిపయింబడి పెద్దగ నేడ్చెను. అట్టియెడ నీయువజనుఁ డత్యాగ్రహమునఁ గోదండునికరమును గట్టిగఁబట్టి "ఈ క్షణమున నీమాలని విడువుము: లేకున్న నీప్రాణములు నీవిగా వనుకొనుము" అనెను.

కోదండుఁడు, "ఓహో! నీవా నన్ను దండించునది!" అని హేళనసేయుచు నిట్లనెను.

"ఓయీ మదనా! నీకిచటఁ బనిలేదు. ఈ మాలఁడు నాసేవకుఁడు. నావద్ద నప్పుపుచ్చుకొనినవాడు. కావున నేను దండించినను, ఖండించినను నీకు జోక్యము కలుగఁజేసికొన నవసరము లేదు.

మదనుఁడు.—దుర్మార్గా నీకించుకయైనఁ గనికరము లేదా? వ్యాధిగ్రస్తుఁడగు నీమాలవాని నకారణముగఁ జంపఁజూచితివే! ఈలోకమున లేకున్నను, బరమందైన నీయీక్రౌర్యమునకుఁ బ్రతిదండన లేదా!

కో.—"అవును. ఈవేదాంతముల నిఁక నిలుపుము. ఈ గ్రామముననున్న హీనకులస్థులందఱును మాతలలపై నెక్కుటకుఁ గారణ మీవగదా! నీవు కులద్రోహివి. ఈనీచునికొఱకై

నన్ను నిందించుచున్నావు. ఇందులకు ఫలము శీఘ్రముగ ననుభవించెదవు."

మద.—నీగంభీరవాక్యముల నిఁక నిలుపుము. అతఁడు నీకేమి యీయవలయునో చెప్పుము.

కో.—నాకితఁ డొక నూఱురూప్యము లీయవలయును.

మాలఁడు—అయ్యా అన్యాయమువలదు. నేను మీయొద్ద దీసికొనినవి యేఁబది రూప్యములేకదా? అందున నీపదివర్షములనుండి నా వేతనమున నర్ధభాగము ఋణమునకై యిచ్చుచుంటినే! ఇపుడు నూఱురూప్యము లెటులయినవి?

కో.—నోరుమూయుము. నాతో వాదించెదవా? నీవు నావద్దగైకొనినవి నూట యేఁబదిరూప్యములు. అందు నీపదివర్షములనుండియు నేఁబదిరూప్యములు చెల్లుబడినవి. ఇంకను నూఱురూప్యములు నిల్చియున్నవి. కట్టినఁగట్టుము. లేకున్న నీపై న్యాయస్థానమున వ్యాజ్యము వేసి వడ్డీ ఖర్చులతోటి రాఁబట్టుకొనియెదను.

ఇదియంతయు విని కోదండునితో వాదించిన నిష్ఫలమనియుఁ దాఁజెప్పినట్లు ఋణమునకై యెవ్వరినేని కూటసాక్షుల నియమింపఁ గలడనియు నెంచి మదనుఁడానాణెముల కాతని పేర నొక పత్రము లిఖించియిచ్చి మాలని ఋణవిముక్తుం జేసి తనపరిచారకులలోఁ జేర్చుకొనెను.

—

# సుజనమైత్రి

## పదవప్రకరణము.

---

ప్రమాదము.

వేణుగోపాలశర్మ కమలావిషయమై స్మరించునపుడెల్ల నాకులపడుచుండెడివాడు. స్త్రీస్వాతంత్ర్య మతని కిసుమంతయు నిచ్చగించమింజేసి తనయిచ్చచొప్పున నామె ప్రవర్తింపకపోయెనే యనునాకులత యతనిని గొంత బాధించుచుండెడిది. తగిన వరుని కొఱ కెంత ప్రయత్నించినను దదాపాదనదుర్లభమగుటంజేసి కడుంగడు నాకులపడుచుండెడివాఁడు. అదియునుంగాక ప్రాయము మీరివచ్చు కారణమున వివాహవిషయమై తొందరపడు చుండెను.

కమల తన కకాలంబున విద్యాభంగము గలిగినందులకు మిగులఁ జింతించి జనకుని యానతిమీరక యింటనే వలయు పుస్తకములఁ దెప్పించి చదువుచు విద్యాభివృద్ధిచేయుచుండెను. స్వయంవరవిషయమున లోకాచారము ననుసరించి తండ్రిగారి కెట్టి యిక్కట్టులగునో యని యప్పుడప్పు డనుమానించినను నాలస్యమయినను తగువరునిఁ బరిణయ మాడవలెననియే కమల యభిప్రాయము. జననీజనకులును గమలామనోభీష్టము బూర్తిగ

నిరాకరింపలేకుండిరి. అన్యోన్యాభిప్రాయము లిట్లుండ నవి విశదీకరించుకొఱకు నాఁడు వారిట్లు ప్రసంగించిరి.

వే.—అమ్మా, నీకు వివాహము సేయుకాలము మించుచున్నది. ఇఁక నాలస్యముచేసిన హానికలుగును. నీకెవరిని జేపట్ట నభిలాషయో నిర్ధారణచేసి చెప్పుము.

క.—నాకిప్పుడు వివాహప్రయత్నమేమి? ఇంకను గొన్నినాళ్లు వేచియుండరాదా?

వే.—అయ్యో! వయస్సుమించిన నాచారహాని కలుగును. పెద్దచిక్కులు సంభవించును. నీవు చిన్నదానవగుటచే నట్లనుచున్నావు. నీవు నిరోధింపకుము.

రాజస—ఇఁక నింతగాఁ దొందరపడనక్కరలేదు. కావలసిన విషయములు జరిగినవి. ప్రతిష్ఠయో, అప్రతిష్ఠయో జరిగిన యంశములనుబట్టియే రావలయు.

వే.—అదియేమి? యేమోజరిగిన దనుచుంటివి.

రా.—ఏమున్నది కమలపుష్ప.

వే.—ఏమి పుష్పములు ధరించుచున్నదా!

రా.—తరువాత రహస్యముగఁ జెప్పెదను లెండు.

వే.—నామనం బాగకున్నది. ఐనదాయేమి చెప్పుము?

రా.—[రహస్యముగ] పుష్పవతి అయినది.

వే.—ఔరా! ఎంతవైపరీత్యము.

రా.—వెలువరింపక శాంతించి జరిగినది రహస్యముగ నుంచుడు.

కమల.—[తల్లితో మెల్లగ] అమ్మా, నాకిఁక వివాహముమీఁద

బుద్ధిపారుటలేదు. నీవు తొలుత నిశ్చయించి నాతో రహస్యముగఁ జెప్పినవరుని నాకు లభింపఁజేసితివేని సమ్మతమే. కానిచో నాకు వివాహముచేయ నక్కరలేదు.

రా.—అమ్మా! అట్లనెదవేమి? అతనియందు మీతండ్రికిఁగల యీర్ష్య నీకుఁ దెలియదా? అతనికన్న నెక్కుడుధనవంతులును జదువరులును లేరా? తదితరులయం దేరినైనను గోరుకొనరాదా?

కమల ఈవాక్యముల నాలకించి విచారభావంబునఁ గన్నీరుఁ గార్చుచు నిలువంబడెను.

వే.—మనయూరనున్న విద్యాదీక్షితునికుమారుఁడు నృసింహరాయునియం దేమయిన సుగుణము లున్నట్లు తోఁచునా?

రా.—అవునవును. అతనికీర్తి జగద్విదితము. ఈవిషయమున నాకును సమ్మతమే. మనయభిప్రాయ మిందేకీభవించినది. ఇఁక ననుమానింపకుఁడు.

వే.—అట్లయిన నిఁక బంధుమిత్రుల కావాహ్వనము పంపెదను.

రా.—అట్లే చేయించుఁడు అది యశస్కరము.

కమల యీప్రసంగము విని యేమియు నెరుగనిదానివలె నటించి సమ్మతించెనా యనునట్లు ప్రవర్తించి వారిమ్రోల నౌదాసీనముపహించెను. పాప మాదీనదంపతులు కొమరితను నమ్మి వివాహప్రయత్నముననుండిరి.

---

# సుజన మైత్రి

## పదునొకండవ ప్రకరణము.

---

### పంచాయతి.

విక్రమసింహాపురమున కనతిదూరముననున్న చిన్నిరాయపురంబున నతిరమణీయమగు నొక్క దేవాలయము కలదు. విచిత్రములగు చిత్తరువులతోడ శోభిల్లుగోపురములతోడను, విశాలమంటపములతోడను, రజితసువర్ణాద్యమూల్యలోహ వినిర్మితములగు వాహనములతోడను, మత్స్యముల మెక్కి తిరుగాడు బకకారండవాదులవిలాసశయ్యలో యననొప్పు నలలవిసురున నటునిటునూగాడు వికచకమలకుముదపుష్పములచే శోభిల్లుకొలంకులతోడను, కోదండరామునియాలయము చెలువారుచుండు. ఆయాలయము నెదుట విశాలములగు చలువరాలచేఁ గూర్పఁబడిన యొకమంటపము గలదు. ఒకనాఁటి సాయంకాలమున నాదేవాలయము మంటపమున ననేకులు సేరిరి. ఎల్లజాతులవారు నాసభ నలంకరించిరి. వీరందరు నెద్దియో యొకవిషయమును గూర్చి యిట్లు తర్కించుకొనుచుండిరి.

ప్ర.—అయ్యా, మహాచిదేవతయగు పోలేరమ్మకు జాతరజరిగి మూఁడేండ్లయినది.

ద్వి.—అవును. ఈసంవత్సరము జాతర జరుపకున్నచో నీయూరు ధ్వంసము గావించును. కావున జాతర జరిగి తీరవలయును.

తృ—అయ్యా! జాతరమహోత్సవము జరుప నెల్లరు నియ్యకొనినవారేగదా!

అవునవును. [అని అందఱు నరచిరి.] అపు డాసభ్యులలో నొక యువజనుఁడు లేచి యిట్లు చెప్పఁదొడఁగెను.

"సభ్యులారా! నేనిచ్చోటఁ జేరినవారందఱికన్న జ్ఞానమునఁ గాని, ధనమునఁగాని యెక్కువవాఁడనుగాను. అయిన నాప్రార్థనము లాలకించవలయును. మీరొనరించు మహోత్సవము నేనేమియు నాక్షేపించువాఁడనుగాను. మీరు తీరుమానించు భంగి నేనును నావంతు కప్పము నర్పింతును. జాతరకాలమున జరుగు కొన్ని ఘోరకృత్యముల నాపవలెనని నా ప్రార్థన. తత్కాలమున జరుగు జీవహింస దలంప నామనం బెంతయుఁ దల్లడిల్లుచున్నది. నిష్కారణముగ జంతుసంతానముల బహిరంగముగ వధించు మనము మృగమాత్రులముగాని మనుష్యమాత్రులము గాము. హింస మిక్కిలి పాపకరము. పుష్పములతోడను, ఫలములతోడను బూజించిన నాశక్తి తృప్తిపడదా? నామొరాలకించి యీఘోరకృత్యము మాత్రము మానిపించెదరుగాక అని ప్రార్థించుచున్నాఁడను." ఇటులఁ బ్రసంగించినది మదనుఁడే.

ఈతనిమాటలను విన్నవారు కొంద ఱీతనికిఁ బిచ్చియనియుఁ గొంద ఱీతనికిఁ బొగరనియుఁ దూలనాడిరి. కొంద

అతని నపహాసించిరి. కాని ఈతని యుద్దేశము నంగీకరించినవారు లేరు. అందరును యథాపూర్వముగ జాతర జరుపవలెననియు, భూస్వాములందరు దమకున్న భూములకొలఁది విత్తము నీయ వలెననియుఁ దీర్మానించుకొనిరి. కార్యనిర్వాహమునకుఁ గొందరు సభికుల నేర్పఱచుకొనిరి.

---

# సుజనమైత్రి

## పంద్రెండవప్రకరణము.

---

### ప్రయత్నభంగము.

"మంగళాస్నానము లైనవా? వధూవరులఁ గైకొని రండు."

"మంగళాసనముల నమర్చితిరా? యూరిలోని పెద్ద మనుష్యుల నాశీర్వచనమునకును దాంబూలగ్రహణమునకు నని యాహ్వానముసేసి వచ్చితిరా?"

"పెండ్లికొమారిత వారి యాహ్వానమైనది."

"ఆలసింపకుఁడు వర్జసమయము వచ్చుచున్నది. మధువును ముందు గైకొనిరండు."

పదంపడి కొందఱు వధువుం గైకొనిరా లోనికరిగిరి. వివిధములగు మధురవాద్యములును, సంతోషసూచకవైవాహిక జనసల్లాపములును, నుభయపార్శ్వముల వింజామరల వీచు వేశ్యాంగనలును జెలంగ నశ్వారూఢుఁడై మహావైభవమునఁ బెండ్లికొమరుఁడు మామగారి గృహ మనఁబడిన యాకైతవ వివాహసదనమునుం జేరెను. వివాహసుముహూర్త మాసన్న మగుడుఁ బెండ్లిపెద్దలు దొందరసేయుచుండిరి. పెండ్లికొమరిత

యింకను రాదయ్యె. ఆమెకొఱకై దాదులు రిల్లెల్ల వెదకిరి. ఎచ్చటను గాన్పింపదయ్యె. ఈవార్త వేణుగోపాలశర్మగారిని జేరె. అతఁ డత్యంత భయాక్రాంతస్వాంతుఁడై కొమరిత గది లోనికిం జనియె. మఱల మఱలఁ దేఱి పాఱఁజూచుటయేగాని, యెవ్వరును గానరారైరి. తుద కామె పరుండినసెజ్జపై నొకలేఖ గాన్పించెను. అద్దానిపై

"నాయనగారగు వేణుగోపాలశర్మగారికి," అని వ్రాయఁ బడియుండెను. అతిత్వరితముగ నాలేఖ నతఁడు విప్పి చదువఁ దొడంగెను.

"జనకా! మీరు దలపెట్టిన యీవివాహము నాకసమ్మతము. పరిణయముగాక వయస్సుమీఱి మీయింటనుండుట మీకపఖ్యాతి. కావున మీగృహము విడనాడ నుద్యమించితి. నాస్నేహితురాండ్రగు కొందఱు క్రైస్తవసోదరీమణులసాహాయ్యమున రాజధానికిం జని యచ్చటనున్న యనాథస్త్రీజనశరణాలయమున కరిగెదను. నన్ను మృతిజెందినదానినిబోలె నరసెదరుగాక. నన్నుఁ దిరిగి కైకొనవలెనని యెట్టిప్రయత్నము సేయుచున్నవారని విన్నను నే నాత్మహత్య గావించుకొని యుసురులఁ బాపుకొనెదను. నన్ను క్షమింతురుగాక. మీకును నాప్రియమైన తల్లిగారికిని నావందనములు.

ఇట్లు మీ యనుంగుకూతురు,

కమల."

ఆహా! యేమి వైపరీత్యము? కల్యాణగృహ మిప్పుడు నిర్యాణగృహముగ మారెను. న్యాయవాదియుఁ దత్కామినియు నిశ్చేష్టులై చెరి యొకపార్శ్వమునఁ బడియుండిరి. పెండ్లికివచ్చిన బంధుగులెల్ల చెల్లాచెదరై వెడలిరి. పెండ్లికొమరుండగు నృసింహరాయఁడు కళ్యాణమంటపమున కెంత సంతోషమున వచ్చెనో యంతసంతాపమున నచ్చోటు వాసెను.

---

# సుజనమైత్రి

## పదుమూఁడవ ప్రకరణము.

---

### వేశ్యాగృహము.

ఒకనాఁటి సాయంకాలమునఁ జిన్నిరాయపురమునఁ గోదండరాముని యాలయమునకు నుత్తరదిశయందుండు వీథి యం దిరువురు పురుషులు ప్రాఙ్ముఖులై నడచుచుండిరి. వీథియందు దేవాశ్రితులగునర్చకులు మున్నగువారు కాపురముందురు. చీకటివేళ యైనందునను మొగంబులు తెలియరాకుండునటుల మేలిముసుంగు లిడి యుండు కారణంబునను నై పురుషు లేర్వై నదియు గుర్తింప నలవికాకుండెను. వారిరువురు నొండొరు లేమియు సంభాషించుకొనక యత్యంత దూర మేగి వీథ్యంత మున నొక యింటివాకిట నిలువంబడిరి. ఆయింటిద్వారము మూయఁబడియుండెను. చెంతను దెఱచియున్న గవాక్షమునుండి ప్రజ్వరిల్లు దీపపుఁగాంతి వెలువడుచుండెను. గృహాంతరమున నొకబాల మృదుమధురస్వనాంచితముగ గానపేటికను వాయించుచు నందందుఁ బాడుచుండెను. వారిరువురిలో నొకఁడు ద్వార ప్రాంతమున కేగి తలుపుదట్టుచుఁ "గోకిలా! కోకిలా!" అని మెల్లగఁ బిలచెను. లోనున్న యొకయువిద "ఇదిగో వచ్చితిని."

అని చెప్పుచు నతిత్వరితమ్ముగ ద్వారముం దెఱచెను. వీరిరువు రును లోనికిం జనిరి. ద్వారము మఱల మూయఁబడెను. ముంగిలి కూట మతిరమణీయముగ వివిధశృంగారరసానుబోధకమ్ములగు పటములచే నలంకరింపఁబడియుండెను. నిర్మలములగు జరీపరిధాన ముల ధరించి వివిధాభరణభూషితయై మందస్మితాననయై కవా టము దెఱచిన యాయువతి ప్రౌఢాంగనగాఁ గనఁబడెను. గాన పరాయత్తచిత్తయగు నాబాలిక పీతాంబరధారిణియై నవరత్న ఖచితములగు నాభరణము లనేకముల ధరించియుండెను. పూర్ణేందుబింబంబును బోలిన యాబాలికముఖంబును గమనించి చూడ నెద్దియో యొక మనోవ్యాకులత యామెయెడ నగ పడునుగాని యది సాధారణముగఁ గాన్పింపరాదు.

"అయ్యలారా! కూర్చుండుఁడు." అని కోకిల స్వాగత మొసంగ నాయిరువురు పురుషులు నున్నతాసనములఁ గూర్చుండి మేలిముసుంగులఁ దీసివైచిరి. వీరిలో నొకఁ డించుమించు ముప్పది ముప్పదియైదు సంవత్సరముల ప్రాయమువాఁడు. ఇతఁడు బ్రాహ్మణవంశ సంజాతుఁడుగ నగపడువాఁడు. ఆతఁ డాయింటి వేశ్యయగు కోకిల విటకాఁడు. బాణుండనువాఁడు. మఱియొకఁడు మదనునికి విరోధియగు కోదండుఁడు. ఈపురుషు లిరువురును గృహమునఁ బ్రవేశించినది మొదలుకొని సరసవాక్యప్రసంగము చేయసాగిరి. ఆముగ్వురిసంభాషణ మించుక నూహాసేయనయ్యె డిని. అపుడు నాయింటనున్న బాలిక విద్యానైపుణ్య మాపాదించి భరతాదికళావిశేషములయందుఁ బ్రౌఢిమగడించెనని కోకిల నుడి

వేను. అప్పుడు బాణుఁడు కోకిలం బిలచి యేదో రహస్యముగఁ జెవిలోఁ జెప్పెను. అంతట కోకిల "ఏమే శారదా లోపల దాఁగుకొనెదవేమే? ముంగడ ద్వారమునకు రమ్ము" అని చెవిలోఁ జెప్పెను. శారద గానపేటికవిడి ద్వారముఖమున నిలచెను.

కోకి.—అయ్యా! యిది ముగ్ధయగుటచే భయపడుచున్నది కనుక చనువు చేసికొనుఁడు.

బా.—శారదా! భయమేల; నాచెంత నీవు నిర్భయముగ నుండ వచ్చును. నన్నన్యునిగఁ జూడఁబోకుము.

కో.—శారదా! అయ్యగారికి శ్రవణానందముగ నొకపాట విని పింపుము.

బా.—పాడుము, పాడుము.

అపుడు శారద లోనికింజని గానపేటిక వాయించుచు మధురాలాపముల నొక్క పాటఁబాడెను అదివిని తరుణవయస్కుఁ డానందమునంది యిట్లనెను.

ఆహా! ఎంత శ్రావ్యము! కోకిలా! శారద నిట్టిస్థితికిఁ దెచ్చినందులకు నిన్ను వేనోళ్లఁ బొగడవచ్చును ఇఁకఁ గాల యాపనము సేయక కన్నెఱికము దలపెట్టుము. వలయు ధనము లిప్పించెద.

కో.—మీబోటి ప్రభువుల కనికరము లేకున్న మాబోంట్లకు బ్రతుకు గలదా! సంగీతభరతశాస్త్రములు నశించియుండవా?

మీరు మమ్ముఁ బోషించుమూలముగ నివ్విద్యలఁ బోషించు వారగుచున్నారు. తమ యనుగ్రహము ప్రకారము సేయు చున్నాను. కాని శారదకు విటకానివిషయ మాలోచించిన పిదపఁగదా కన్నెఱికముమాట.

బా.—కోదండా! మాటాడవేమి?

కోదం.—మాటాడుట కేమున్నది? మఱలవచ్చెదము రమ్ము.

ఇటుల సంభాషించి యాయువకు లిరువురును కోకిలాదత్త సుపుష్ప చందన తాంబూలాదులం గ్రహించి నమస్కారముల నంది, యానందించి, యాశీర్వదించి, యత్యుల్లాసమునఁ దిరిగి వచ్చెదమని చెప్పి యా వేశ్యాగృహము వీడిరి.

---

# సుజనమైత్రి

## పదునాల్గవ ప్రకరణము.

---

జనసేవ.

సుందరుని రాజధానియందు విశ్వవిద్యాలయమున విడిచితిమి. అతఁడచట వైద్యవిద్యయందు దినదినాభివృద్ధి గాంచుచు విజయోన్ముఖుఁడై యుండెను. ఈసమయమున రాజధానికి మహారాష్ట్ర దేశమునుండి యొకమహానీయుఁడు వచ్చెను. ఇతఁడు దేశసేవకై ప్రపంచసుఖమునెల్లఁ ద్యజించిన గొప్పదేశాభిమాని. రాజధానియం దితఁడు హైందవజనసంఘసంస్కారణవిషయమై యనేకములగు నుపన్యాసముల నొసంగెను. మనదేశముననున్న వివిధవర్ణ భేదములును దేశక్షేమమునకు హానికరములనియు స్త్రీపురుషులందరును సంఘసంస్కారాభివృద్ధికై కృషిచేయవలయుననియు నామహానీయుఁ డుపదేశింపఁ దొడఁగెను. ఏమి వీరి యుపన్యాసముల మహిమ! వీరు రాజధానిని వదలిన కొలఁదిదినములకే యచ్చోట సంఘసంస్కరణ సభలనేకములు నిర్మాణములయ్యెను. అందు దీనజనసేవక బృందమను సభకు సుందరుడు కార్యదర్శిగ నియమింపఁబడెను.

ఈసంఘమునఁ జేరినవారందఱు జనసేవయే ముఖ్యమైన ప్రపంచవిధిగ నెంచి నిమ్నజనోద్ధరణమునకును, నానావిధవర్ణ

ఛేదభంగమునకును, స్త్రీజనౌన్నత్యమునకును బాటుపడుచుండిరి. ఉపన్యాసములవలనను, బోధవలనను వీరియుద్దేశములు వెల్లడి సేయుచుండిరి. వ్యాధిగ్రస్తులును, సన్నహీనులును నగు దీనుల యిడుములఁ బాపుట వీరివిధి.

ఒకనాఁటి యుదయమున సుందరుఁడు నిమ్నజనఘట్టము నకుఁ జని యచ్చోటి బాలురకై తన సభవారివలన నిర్మితంబైన పాఠశాలం బరీక్షించి మరలుతఱి నొక యువతీమణి చెంగట నున్న యొకగృహమునుండి వెలువడెను. ఆయమకుఁ బదునెని మిదియేండ్లప్రాయ ముండును. ఆయువతి జగన్మోహనాకారమును, నొయ్యారమును, నరసి సుందరుఁ డచ్చెరువంది కొంతతడవు నిలువంబడెను. సుందరుని గాంచినంతనె యాసుందరీమణి మిగుల లజ్జావిస్మయములనంది తలవంచెను. కాని యాయమ యెవ్వ తెయో సుందరునకుఁ దెలియదు. ఆజవ్వని కొంతదూర మేగిన పిదప సుందరుఁ డామెత్రోవనె బోవసాగెను. వారిరువురకును నించుమించు పదిగజముల దవ్వుండవచ్చును. అట్టితఱి హఠాత్తుగ నొక స్వాగమనశకట మెదుర్కొన నాకామిని యటు నిటు పోవఁ జూచెను గాని తడవులేమిం జేసి యాశకట మాసతిం డీకొనెను.

"హా! సుందరా!" అని అఱచి యామె యాత్రోవ ప్రక్కంబడెను. ఈవిపత్తు నరయుడు సుందరుఁడు సతికడకుఁ బఱుగిడి కనుఁగొన నామె శవాకృతిగ నుండెను. నోట రక్తము వెల్లువగఁ బ్రవహించుచుండెను. ఆశకట మచట నిలుపంబడెను.

పలువు రత్తావు నేరిరి. వెంటనున్న బాలికవలన నాజవరాలనాథస్త్రీ శరణాలయమువనుండు సోదరీమణులలో నొక్కతెయనియు, రోగులసంరక్షణముకొఱ కనుదినమును నౌషధము లిచ్చుననియు, నెఱింగి సుందరుఁ డాశకటమున నామె నుంచుకొని శరణాలయమునకుఁ జనియెను.

ఆమె మూర్ఛిలి మాటాడకుండుటం జేసి నేలపై వ్రాలు నపుడు తన నామ మేల స్మరించెనో సుందరుఁడు గ్రహింపఁ డయ్యెను.

---

# సుజనమైత్రి

## పదియేనవప్రకరణము.

---

వైపరీత్యము.

చదువరులారా! చూచితిరా! విధికృతవైపరీత్యము! తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచునను నార్యోక్తి కల్లగాదు గదా! వేణుగోపాలశర్మ యెట్టికులాచారపరాయణుఁడు! సనాతనకులధర్మములు విడువక యుద్ధరింపవలయుననియుఁ,గులధర్మము నేమాత్రము మీఱరాదనియు, నట్లు తప్పినవారినిఁ జెంతనైనఁ జేర్చుకొనరాదనియునతనిముఖ్యాభిప్రాయము అట్టివానిగర్భమున జనించినవారి గుణవైపరీత్యమును జూడుఁడు. తనయుఁడు విష్ణుశర్మ తండ్రియనుమతిలేకయే యాంగ్లేయదేశమునకుం జనుట! తనయయగు కమల వివాహమొల్లక యిలువెడలి చనుట! వేణుగోపాలశర్మ తనబిడ్డలయం దనురాగముగలవాఁడు. వారిని సనాతనధర్మములఁ దప్ప నీయరాదని అతనినిర్ధారణము. కాని విధిబలము సర్వోత్కృష్టము. బిడ్డల వియోగము భరింపఁజాలక రాజస యతిశోకార్తయై కొన్నినాళ్లుండి తుద కావ్యాకులతవలననే కాలధర్మము నొందెను. "విపద్విపద మనుబధ్నాతి" అను నార్యోక్తి ననుసరించి శర్మగారి కన్నియిక్కట్టులును నొక్కసారి సంఘటించెను. ఇప్పటికైనను న్యాయవాది స్వభావమున

మార్పుకలుగదాయె. పరోపకారము నొల్లఁడాయె. కేవలము ధనార్జనపరుఁడు సనాతనకులాచారములం దతి మూఢభక్తి విడు వఁడు. మనోభీష్టములన్నియు నొక్కొక్కటిగ విఫలములయినను నతని కఠినహృదయ మించుకయుఁ గరుగదయ్యె. ఇసుమంతయు భూతదయ పొడసూపదయ్యెను. భార్యాపుత్రికలవియోగము నకుఁ గారణము సుందరుఁడని యూహ సేసి వానిని కఠినదండనకుఁ బాత్రునిఁజేయవలెనని ప్రతిన పూనెను. ఇదియంతయు నన్యా యమేకదా! సుందరున కీవృత్తాంత మేమయినఁ దెలియునా! కమల తనయం దభీష్టము వెల్లడించె ననువిషయమయిన సుందరుఁ డెరుంగునా? ఆజవ్వని రాజధాని కేగుట యెరుంగునా? ఇది యంతయు సుందరప్రేరితమని వేణుగోపాలశర్మగారి యభి ప్రాయము. ఎవ్విధముననైన సుందరుని శిక్షింపవలెనని తనమిత్రు లనేకులవలన సుందరుఁడతిదుర్మార్గుఁడనియు నతనికి సాహాయ్యము చేయరాదనియు మదనునకు బోధచేయించెను. మదనుఁ డీమంత్ర ములఁ బెడచెవిబెట్టి నిక నది యసాధ్యమని తలఁచి సుందరు నిడు మలబెట్ట నెన్నియో యుపాయముల నూహించుచుండెను. కమల కులభ్రష్టయయ్యెనని యీబాలవిషయము కలనైన స్మరింపఁడాయెను. ఎటులనైనఁ గుమారు నాంగ్లదేశమునుండి శీఘ్రముగ రప్పించి మతాధిపతుల యనుమతినొంది వానిం గులంబునం జేర్చుకొనవలెనని వానియాశయము. తనకుఁగలిగిన కష్టములనెల్లఁ దెలియఁజేయుచు నిఁకఁ బ్రపంచమున విష్ణుశర్మ కొక్కఁ దనకు మఱొకయాశ లేదని యెఱింగించుచు నెటులనైన

మూర్ఖతమాని తనచెంతకు రావలెనని కుమారున కొకలేఖ నంపెను. అందుల కతఁ డదియెల్ల విధికృతమనియు దానికై చింతిల్లిన మానవుఁ డవివేకియనియుఁ దనకు విద్య సంపూర్ణమగు నంతవరకు స్వదేశమునకు రానిచ్చ లేదనియు నప్పటివరకుఁ దండ్రి ధైర్యమున నుండవలయుననియు వ్రాసెను. ఎప్పటికైనను బుత్త్రుండు తన్నుఁ జేరుననునాసయే ప్రాణాధారముచేసికొని గోపాలశర్మ ధైర్యముపూని వలయుధనములు కుమారున కంపుచుఁ గాలము పుచ్చుచుండెను.

---

# సుజనమైత్రి

## పదియాఱవప్రకరణము.

---

వేశ్యమాత.

కోకిల.—శారదా! ఈవస్త్రములు బాగుగనున్నవా? ఇదియేమి కర్మమే? ఏమాటకును బదులుపలుకవేమే? కోదండుఁడొసంగిన ధనము వెచ్చపెట్టి నీ కమూల్యవస్త్రాభరణములను దెప్పించెదను. ఇప్పటికి వీనితోఁ బరితృప్తిచెందుము.

శారద.—వస్త్రాభరణములకేమిలే?

కో.—ఏమమ్మా! వగపునకుఁ గారణము?

శా.—రేపా! కన్నెఱికము?

కో.—ఎంత టక్కులాడివే? అన్ని సంగతులు నొకప్రక్కఁ జూచుచునే యేమియుఁ దెలియనట్లు నటించెదవు!

శా.—అమ్మా! నాకు దేహము స్వస్థతగా లేదు. ఇంకఁ గొన్నినాళ్లు పోవలను పడదా?

కో.—శారదా! ఇప్పటికి నిన్ను బదునాలుగేండ్లు సాకితినిగదే! యింక నెంతకాలము నీకొఱకై కష్టపడఁగలనే? (కన్నీరు గార్చును.)

శా.—ఇంతకాలము నామనోభీష్టము నీకెఱింగింపక యూరకుంటిని. ఇంక నీమనోవ్యాకులత భరింపఁజాలను. అమ్మా! ఈ వేశ్యావృత్తియందు నాకిష్టము లేదు. నన్నెరికైన నొసంగి పరిణయము గావింపుము.

కో.—ఎప్పటినుండి నీ కీరోగము పుట్టినదే? విచ్చలవిడిగ నీకిచ్చ వచ్చిన విటకాండ్రమచ్చికలచే మెప్పించి యిచ్చవచ్చినయట్లు విహరింపక నొకబిచ్చగాని జేపట్ట నిచ్చగించెదవేలనే? ఈ ప్రల్లదనము నిఁక నిలుపుము.

శా.—తేనికి నుంపుడుకత్తెగా నుండుటకన్న బిచ్చగాని సుధర్మపత్నిగా నుండుట మేలు. ఈవిషయమై యెంతయో లోలోన యోచించితిని. లజ్జావిహీనమగు నీస్వైరజీవన మెంతయు హేయము. నాకు ధనము లక్కఱలేదు. వస్త్రాభరణము లక్కఱలేదు. శరీరకష్టముచే బ్రతికెదను. నాయందు గనికరముంచి నాకుఁ బరిణయము గావింపుము.

కో.—[గద్గదస్వరముతో] "అయ్యో! నీకెట్టిదుర్బుద్ధి పుట్టినదే!" అని శారదం గౌఁగిలించుకొని ముద్దిడుచు "అమ్మా! నీవిటులాడఁదగునా? నీకై యెంతధనవ్యయమై యుండునో యెంత కష్టపడియుండునో యోజింపుము. అట్టి నామాట పాటింపవా? నాకుఁగల ధనమంతయు నీదేగదా! నీవుదక్క నా కొరులు గలరా? నేను నీశ్రేయము గోరుదానను. నన్నునొప్పింప నీకుఁ బాడియే?

అని కడుగారవమున నుడువ నిఁక నాయమతో వాదించుట నిష్ప్రయోజనమని యెంచి శారద యూరకుండెను. కాని యెవ్విధముననైన నాహేయవృత్తి మానవలెనని నిశ్చయించుకొనెను. వేశ్యమాత శారదను మాయచేసితినని దలపోసి లోనికిం జనెను. శారద తలవాకిలిం జేరి యాలోచించుచు నిలువంబడెను. తొలుత మాలనిగాపాడిన విబుధునివంటి పరోపకారి తనపాలంబడఁడాయెగా యని విచారించుచుండెను. భగవదనుగ్రహమున నాఁటిసాయంకాలమున నామాలవానిఁగాపాడిన యువజనుఁడే మదనసమాఖ్యుఁడే కోదండరాముని యాలయము ప్రాంతమున నరుగుచుండెను. అతనిఁజూచి శారద గడగడ వడఁకుచుఁ జరణయుగ్మమున వ్రాలి

"అయ్యా! ఆర్తను. శరణ్యను. రక్షింపుము" అని వేఁడెను. మదనుఁ డామె కభయహస్తమిచ్చి జరిగినవృత్తాంతము వినుచుండెను.

---

# సుజనమైత్రి

## పదియేఁడవ ప్రకరణము.

---

అజ్ఞాతానురాగము.

అమ్మా! యామె కీనాఁ డెట్లున్నది?

గతదినమునకన్న మేలుగనే గానవచ్చుచున్నది.

ఇఁక భయము లేదు.

అయ్యో! అట్టిభయ మేమైన నున్నయెడల శకటావఘాతకాలముననే గతించెడిది. మనస్ప్రుహకూడ వచ్చెడిదా?

పాపము ఏమి వైపరీత్యము! ఔషధసేవలో మిన్నయై పరోపకారవీక్షాపరతంత్రయై యనాథజనశరణాలయమునకు సనాథత్వమారోపణచేసిన యమలస్వభావ కిట్టి దురవస్థ సంభవించుటా! సోదరీ యీయాలయమునకు నధ్యక్షత యెవనిది?

ఈమెదే.

ఓహో తద్గుణమును నీమె చారిత్రములోనిదేనా? ఈమెతోఁ గొంచెము ముచ్చటించవలయును. నిదురవోవుచున్నదియా? లేక యాయాసమున నట్లుపడియున్నదియా?

నేను మేల్కొల్పెదను. నిద్రపోవుచునే యుండవలె. అమ్మా! అమ్మా! అయ్యగారు వచ్చినారు.

ఆయువతి యయ్యెడ నిదురమేల్కాంచి సెజ్జవిడచి నమస్కరించి యిట్లు సంభాషించెను.

ఆర్యా! మీసాహాయ్యమున నేటితో నాకు శరీరమెల్ల స్వస్థత చెందినది. ఆనందము. నాకు మహోపకారము చేసితిరి. అనేక వందనము లాచరించుచున్నదానను.

నీవు గావించు వందనములకు నే నర్హుఁడనుగాను. అంతయు సర్వేశ్వరుని సాహాయ్యమే.

అయ్యా! తమరు గతదినమున సెలవిచ్చినరీతి నీనాఁడు సముద్రతీరమునకుఁ బోవలెనని నిశ్చయించుకొనినదానను. నియమితకాల మాసన్నమయినది. తమరుకూడ విచ్చేసెదరని నా ప్రార్థన.

ఇంతకన్న సుఖవిశేషముకలదా! అటులనే పోవుదము.

పదంపడి యిరువురును బరిచారికను వెంటఁగొని సంద్రంబు తీరంబున కరిగిరి. సాయంసమయ మాసన్నమగుచుండుటచే సాగరమునఁ గలకలము మీఱుచుండెను. సకలజీవకోటుల కాధారభూతుండును సర్వలోకములకుఁ దేజఃప్రదాయకుండును; సర్వాంతర్యామియు సకలగ్రహాధ్యక్షుండును నగు భానుఁ డస్తాంబుధిఁ గ్రుంకుచుండెను. తైక్ష్ణ్యహీనములయిన భానుకిరణములచేఁ బ్రపంచమెల్ల సువర్ణశోభం గాంచెను. వివిధవాహనారూఢులై యేతెంచినజనంబులు తమవాహనముల చెంగట నిలిపి యయ్యపారపారావారతీరమున నటునిటు తిరుగుచు నానందించుచుండిరి. ఎల్లజాతులవారు నాతీరమునఁ గాన్పించుచుండిరి. స్త్రీపురు

షులు విహారార్థమై పులినంబుల వ్రాలి యొండొరులు ముచ్చ టించుకొనుచుండిరి.

విద్యార్థులు కొందఱచ్చోటఁ బరుండి తమతమ పాఠ్యములఁ జదువుచుండిరి. బాలురు కొందఱు నీటియందు దిగి చిన్ని చిన్ని యలలస్పర్శమున నానందించుచుండిరి. అచ్చోటి వారి మొగముల నెల్ల నానందము వెల్లివిరియుచుండెను.

మనశృంగారనాయికానాయకు లొక్కచోటఁ బులినతల మునఁ గూరుచుండి చనువున సంభాషింపఁదొడంగిరి. అయిరువురి యందును సంభాషించులక్షణములును నప్పుడప్పుడు గావించు మందహాసములును నచ్చోటి దిగుగాడుజనముల కభినవమార్గావ లంబులగు దంపతులో యనునట్లు తోఁపఁజేయుచుండెను. భాను బింబము చరమాంబుధిలో మునింగెను. కొలఁదికాలమునకే యచ్చటివా రనేకు లచ్చోటువదలి తమతమగృహముల కేగిరి. నిర్మలమగునాకసమునఁ బరిపూర్ణ తేజమున జాబిల్లి రాజిల్లెను. చల్లనితనకరమ్ములచే నెల్లవస్తువులఁ దెల్లనఁ చేయుచు నల్లనల్లన నేతెంచు నాజాబిల్లిఁ జూడ నెవ్వానియుల్లంబు రంజిల్లకుండు! సాగరంబును దుహినకరప్రభావమున నుప్పొంగె. వేరలలచే భీకరారావము సేయఁదొడంగె. ఇట్టి యుత్సాహవేళ మన నాయికానాయకులకే యననేల? శృంగారవిహారము గావించు నెవ్వరికైనఁ బరస్పరానురాగ ముద్భవిల్లకుండునే?

---

# సుజనమైత్రి

## పదునెనిమిదవప్రకరణము.

---

### జాతర.

ఔరా! చిన్నిరాయనిపురమందలి యీగందరగోళమేమి? గ్రామమధ్యమున నీజనసంఘమేమి? యూరి నట్టనడుమ నీచిన్ని యాలయమేమి? ఏటి కీపురమంతయు నిట్లుగా నలంకరింపఁబడినది. జనసమూహముచే నంగళ్లు నిండియున్నవి. అచ్చటచ్చట కొందరు స్త్రీ పురుషులు రాటనములపైఁదిరుగుచున్నారు. కొందరు వివిధములగు వేషములు ధరించి నృత్యములు గావించుచున్నారు. కొందరు పీటికలయందలి చిత్తరువులఁ జూచుచు నానందించుచున్నారు. కొంద రందందు చెప్పఁబడు జంగాలకథలను వినుచున్నారు. సూర్యాస్తమయ సమయమున నూర గ్రుమ్మరి గృహమునుండి విగ్రహముం గొనిదెచ్చుచున్నారు. తప్పెటలు ఢంకాలు మున్నగు వాద్యవిశేషములు మిన్నంట మ్రోయుచున్నవి. దిశలెల్లఁ బిక్కటిల్లుచున్నవి. ఆమ్రోతలకు దేవతావిగ్రహము మ్రోల స్త్రీ పురుషులు గొందరు మధుపాననిమగ్నులై భీకరారావములఁ జేయుచు నృత్యములు జేయుచున్నారు. ఆయూరఁ గాఁపులు మున్నగువారందరు దీర్ఘదండములబూని

జనముల వెనుద్రోయుచున్నారు. స్త్రీపురుషు లనేకులు తమ మ్రొక్కులు దీర్చుకొను నుద్దేశమున తలలపై దీపముల నిడుకొని దేవతం దర్శించుచున్నారు. కొందరు దేవతయెదుట నన్నరాసులఁబోసి గొఱ్ఱెలను మేకలను గోళ్లను బలియిచ్చుచున్నారు అట్టిసమయమున వెంటఁదేఁబడు దివిటీలఁగాంతిచే నాదేవత మొగం బతిరౌద్రాకారమునఁగనఁబడుచున్నది. "దేవతయాలయమున కరుగుచున్నది." త్వరసేయుఁడని కొంద ఱఱచుచున్నారు. ఏమిహేతువ అని వితర్కించుచు నొక్కజవ్వనుఁడు మిన్నకయాలోచనచేయుచున్న వాఁడు. కొంతతడ వీయాలోచనచేసిచేసి తుద కత్తావునువిడి యేగెను. దేవత నాలయములోనికిఁ గొనిపోవకమున్నె యూరపోతను నొకమహిషమును బలియిచ్చు నాచారముగలదు. ఆమహిషము నాదినమున గ్రామమంతయుఁ ద్రిప్పి యచ్చోటికిఁ దెచ్చియుండిరి. ఆపోతును దెగనాడువిధి యాయూరి వెట్టిమాలనిది. దేవత యచ్చోట నిలువఁగనే వెట్టి వానిని వెదకిరి. సమయమునకు మాలఁడు రాఁడాయెను. తొలుత నీయాడంబరముఁజూచి యేగిన పురుషుఁ డేమయిన నాటంకము పన్నెనేమొగాని యాయూర నెచట వెదకినను వెట్టిమాలఁడుగాని వానిబందుగుఁడు మరియొకఁడుగాని కానరాఁడయ్యె. అతనిపై నందరకును ననుమానము జనించె. ఆయూరి కాపుజనంబంతయు నాలోచనశూన్యులై తొలుత జీవహింసవలదని ప్రార్థించి యేగినవాఁడే తిరిగి యీజాతరసన్నాహముఁ జూచి యేఁగినవాఁడనియు నతఁడే యీద్రోహము చేసినవాఁడనియుఁ

దీక్షానించుకొని యాతనిపైఁ గసిదీర్చుకొన నూహించుచుండిరి. అచ్చట నున్నవారలలో నొకయువతి పీరావేశంబున "నేఁ బోలే రమ్మను నేఁబోలేరమ్మను నాపోతును నాకియ్యక నన్నవమానించు చున్నారు. మిమ్ముల ధ్వంసముజేసెదను" అని రక్తాక్షియై భీకరా రావమున నరచెను. అప్పు డాయూరి గాపులలో గొందఱు వృద్ధు లాయమకు సాంబ్రాణిధూపములును కర్పూరహారతియు నిడి కేల్మోడ్చి యతివినయమున నిట్లనిరి. "తల్లీ! నీవు లోక మాతవు. మేము నీబిడ్డలము. మాలో నొకనిఁగృత్యమున నీ పోతును దెగటార్చుమాలఁ డొక్కఁడేనియు నిచ్చటికి రాఁడా యెను. మాయందు దయగొని యీసారి కొకగొఱ్ఱెం గొని యాలయముం బ్రవేశింపుము. అతిశీఘ్రకాలమున మరల మీకొక జాతరగావించి పదిబోతులను బలి యిచ్చెదము. ఈతప్పు క్షమించి మమ్ము గావుము." ఇటు లనేకవిధముల మొరలిడ నాశక్తి శాంతించి యానాఁడు బఱ్ఱెకు బదులు గొఱ్ఱెం గొని యాలయమునఁ బ్రవేశించెను. అంతటితో పురజనులు శాంతి నొందిరి. కాని కొందఱకు దమ్మట్టి యవమానముపాలచేసిన యా మదనుని శిక్షఁజేయవలయు నను వెఱ్ఱిబట్టినది. వారిలో బాణ కోదండు లిట్లు బ్రసంగించిరి.

బా.—అయ్యా చూచితిరా మదనుని యక్రమము. మనయూరి వారల నుదాసీను లగుటఁజేసి మదనుఁడు తనయిచ్చవచ్చి నట్లు జేయుచున్నాఁడు. అతఁడు మనకన్న నెద్దానియం దధి కుఁడు? మీకున్నధనము నాకున్న నేనెప్పుడో మదనునకు

గర్వభంగము చేసియుందును. మీలోభిగుణమే మిమ్ము జెరచుచున్నది.

కో.—ఎంతధనవ్యయమయిననేమి ? మనము వెనుదీయవలదు. ఎటులనయిన నాదుష్టుని శిక్షించు నుపాయ మూహింపుము.

బా.—తగునాలోచన నేను చెప్పెదను. సింహపురంబునకు పోవుదము రమ్ము. అయ్యిరువురును మరికొందరును మదనుని పరాభవించు నాలోచనలు చేయఁదొడఁగిరి. కాని విధివైపరీత్యముల నూహింపలేదు.

---

# సుజనమైత్రి

## పంచోన్మిదవప్రకరణము.

---

వాగ్దానము.

నేనొకవిషయము నిన్నడుగవలెనని యనేకదినములనుండి తలపోయుచుంటిని. గాని మనకిరువురకును దగుమైత్రి లేనికారణమున నూరకుంటిని. అద్దాని నిపుడైన నడుగవచ్చునో లేదో యని నామనము చిందరవందర యగుచున్నది.

సంకోచింపకుము. నీవే నాయెడ రహస్యము వెల్లడింప సందేహించు నెడ నింక నాకు నిజమైన ప్రియు లెవ్వరున్నారు? సత్వరముగ నడుగుము.

తొలుత శకటావఘాత సమయమున సుందరా! అని అఱచితివి. అతఁ డెవఁడు?

నే నట్లఱచితినా! [అని లజ్జావిస్మయంబులఁ దలవంచెను.]

అవును. అఱచితివి. ప్రాణాపత్సమయమున నిన్నుగాపాడిన దెవ్వరు?

ఆధన్యుం డిచట నాచెంతనున్న సుందరుఁడే.

తొల్లి నట్లు కేకవైచినపు డుద్దేశించినసుందరుఁడును నిపుడు నీచెంగటనున్న సుందరుఁడును నొక్కఁడేనా?

ఒక్కఁడే యయియుండవచ్చును.

ఇంకను సందేహామా?

సందేహా మిపుడు విడినది?

నీతండ్రి యెవరు?

వేణు.—అని చెప్పునంతలో సుందరుఁడు వెనుకంజవైచెను. అఁ గ్రహించి కమల యతనితో నిట్లు ప్రసంగించెను.

అయ్యో! వెనుదీసెదవేమి?

వేణుగోపాలశర్మ యని చెప్పెదవేమో యని భయపడితిని

అటయిన భయమేమి?

అతఁడు నాకుఁ బరమశత్రువు.

అయిన నేమి? నేను మిత్రురాలనుగదా?

పాము శత్రువును బడగ చుట్టమును, గానోపునా?

అయ్యో! నామనోరథమున కెదురాడవలదు. నీకతమున జననీజనకులను సకలసుఖములను విడనాడి రాజధానిని జేరితిని. పిదప నిన్నియిడుమలు సంఘటిల్లినను నీయం దాసచే నుసురుల నిలిపితిని.

ఈ సతివాక్యముల విని నంతనే సుందరున కేమియుఁ దోఁచదాయెను. సింహాపురమునం దీయువతి నెన్నఁడును నతఁడు మాచి యెఱుఁగఁడు. పరిణయభంగముకావించి కమల రాజధాని జరిగిన వృత్తాంతముమాత్ర మెఱుంగును. ఇంకఁ గొంత ప్రసం గించి యామె యాతనియందలి యనురాగమువలనఁ బడినపాట్లెల్ల

గ్రహించి తుదకుఁ గమలను మధురగంభీరవచనముల నోదార్చుచు నిట్లనెను.

ఇపుడు నేను వివాహవిషయము దలపెట్టినవాఁడనుగాను. నేను జేయఁదలఁచిన ప్రయత్నమెల్ల సఫలమైనపిదప నాకీవాంఛ పొడమును.

అంతవఱకు నేనెవ్వరిని బరిణయమాడను. అప్పుడు నాకు వివాహేచ్ఛ నిలచెనేని నిన్నే గైకొనెదను. అంతవఱకు మన యన్యోన్యానురాగము వెల్లడిసేయరాదు. భగవంతుఁడు మన సంకటములెల్లఁ బాపి మనకు సుఖముగూర్చునుగాక.

అయ్యెడ శీతకరుండు నిష్కళంకములగు నిజకళలచేఁ గమలాసుందరుల మొగముల వికసింపఁజేసెను. అమితానందకరములగు నొండొరులవీక్షణము లెదురొ్కనెను. ఇప్పటికే కాలాతీతమయ్యెను. ఇంకను గాలముగడచినచో హానివాటిల్లునని వారచ్చోటు విడువనెంచిరి. సుందరుఁడు నిజమందిరమునకును గమల యనాథశరణాలయమునకును నరిగిరి.

---

# సుజనమైత్రి

## ఇరువదవ ప్రకరణము.

---

### —— కన్నెఱికము. ——

కోకిలా నిర్దిష్టనిషేకముహూర్తకాలము సమాసన్నమయ్యెను. వేశ్యమాత బంధువర్గములనెల్లఁ బిలిచి విందులఁ గావించెను. సాయంకాలమున చామనచాయ వేసమువాఁడును, జక్కఁగఁ గత్తిరించఁబడిన సన్నని మీసమువాఁడునునగు కన్యార్థియగు కోదండుఁడు నిడుదలగుకుఱులు మెడలపై వ్రాలఁ జక్కదిద్ది చెంగావివలువల నంగమున ధరించి యొకధవళాంబరము వల్లెవాటుగ వైచికొని యొయ్యారమునఁ గోకిలాగృహము సేరెను. ఆగృహ మతిరమణీయముగ నలంకరింపఁబడెను. పచ్చనియాకుల తోరణము లన్నిద్వారముల నలరారుచుండె. కుడ్యములెల్లఁ జిత్రకాదీపితములయ్యెను. అహో! వేశ్యాంగన శయ్యాగృహము రామణీయకము! “ఒక రసికుఁడు గదిలోనికిఁ బ్రవేశించునంతనె నలుగురు రసికులగుదురా?” యన్న చందము దోఁప నలుదెసల నిలువుటద్దములసౌరును, శయ్యాస్థలమునఁ బండుచో నేదెసజూచినఁ గృష్ణలీలాసూచకములగు పటముల మొత్తములును నెట్టియమాయకునకును బ్రోత్సాహము గలుగఁ జేయకమానవు. శారద వివిధాభరణభూషితయై శయ్యాగృహ

మున నమర్చిన యాసనమునఁ గూర్చుండెను. కోదండుఁ డత్యా నందభరితుఁడై కూర్చుండి యిట్టటలూఁగుచుండెను. ఆతని మిత్రుఁడగు బాణుండును వానిచెంత నిలువంబడియుండెను.

అప్పు డనేకులు శృంగారవనితలు పాటలుఁ బద్యములుఁ బాడుచు మంగళహారతుల నొసంగుచుండిరి. అచ్చటివారెల్ల నానందజనితకోలాహలమున నుండుసమయమున నలుగురు రాజభటులును నొక రాజోద్యోగియు నావేశ్యాగృహమునం బ్రవేశించిరి. వారిని జూచినంతనె గృహములోని కోలాహల మెల్ల నడఁగె. వారందఱు దిగ్భ్రమనొంది యేమియుఁ దోఁచక నిలిచినవారైరి. రాజోద్యోగి యపుడు "కోకిలయు, బాణకోదండు లును, రాజాజ్ఞానుసారముగ ఖయిదీలు లేచిరండు" అనెను. వేశ్యాగృహసమాగతబంధువర్గము లత్యాతృతచెంది తన్మోచనో పాయముల నూహింపసాగిరి. అవ్వేళ నాయింటజరిగిన కల్లో లము వర్ణనాతీతము. శారదపైఁబడి కోకిల "ఓసీ ఘాతుకురాల! ఎంతద్రోహపుఁ దలంపు తలంచితివే!" అని యామెను గొట్టఁ బోయెను. బాణునిసంతోషోత్కృష్టత విచారవిశేషముగ మారెను. కోదండునిమోమున నెంత వెదకినను నెత్తురుచుక్క లేదయ్యె. ఎట్టకేలకు రాజభటులు బలాత్కారముగ నాకోకిలను బాణకోదండులను గూడ గృహము వెలువరించిరి. బాణకోదండు లకుఁ దమసహాజవిరోధియుఁ దొలుతనుండియుఁ దమ్ముఁ బరాభ వించుచున్న వాఁడును నగు మదనుఁడు మాటిమాటికిని జ్ఞప్తికి వచ్చెను.

# సుజనమైత్రి

పదంపడి శారద తనకు దుష్టులగు నావిటకాంద్రనుండి రానైనయిక్కట్టుతొలఁగినదని మనమున నెంతయు సంతసించి ఆత్మరక్షకుఁడగు మదను నుద్దేశించి యిట్లనెను.

"హా! మదనా! మదనా! నీయౌదార్యమునకును, ధైర్య సాహసములకును, ధర్మపరిపాలనాసక్తికిని, నార్తజనరక్షణాభి లాషకును, దుష్టశిక్షణానురాగమునకును, భగవంతుండు నిన్నెం తయు రక్షించుఁగాక. చిరకాలము నీవే రీజగమున వర్ధిల్లుఁగాక."

శారద యుక్తవయస్కురాలగుటకు మున్నే వ్యభిచారి ణింజేయ నుద్దేశించినందులకై బాణకోదండులకును, గోకిలకును కఠినశిక్ష ప్రాప్తించెను. మఱియు వారుముచ్చురును జెఱసాలం బ్రవేశించి యొక్కొక్క రాఱుమాసములు కఠినశిక్ష ననుభవించు నట్లాజ్ఞాపింపఁబడిరి. రాజకీయోద్యోగస్థుల యనుమతినంది మదనసుందరులసహాయంబున శారద రాజధానికిం జని యనాథ స్త్రీజనశరణాలయమునం జేరి యతినిపుణత్వమున ననేకవిద్యల నభ్యసించినదాయెను.

---

# సుజనమైత్రి

## ఇరువదియొకటవ ప్రకరణము.

---

### ఉపదేశము.

మదనుని వృత్తాంత మంతగాఁ జెప్పి యాతని నివాస సౌధమునందము సెప్పకుండుట యధర్మము. మదనుని నివాస సౌధము చిన్నిరాయని పురమధ్యమున నున్నది. అంబరచుంబితంబులగు బహిఃప్రాకారములదాఁటి లోనికిఁ బ్రవేశించినంతనే చిత్రములగు చిత్తరువులచే నింపౌసగు కవాటముల నలరారు ద్వారబంధము గాన్పించును. లోన విశాలమగు ముంగిలికూటమును, దత్ప్రదేశముననున్న యనేకవిధములయిన యాసనములును గుర్చీలును సోఫాలును మంచములును నమర్చఁబడియుండెను. ఆకూటస్థానమునుండి పెక్కుగదులకు ద్వారము లమర్చఁబడియుండెను. సౌధమునకు వెనుకప్రక్క వంటశాల యొకటి ప్రత్యేకముగ నిర్మింపఁబడియున్నది. ముందలిపార్శ్వమున వాహనశాల యొకటి గలదు. అందొకప్రక్క నశ్వము లుండును. మఱియొక చెంత నశ్వశకటములు గానవయ్యెడిని. మఱియొకశాలయందు వృషభమహిషాదిపశుగణములు గాననగును. ముంగిలికూటములనుండి సౌధోపరిభాగమునకుఁ బోవఁబడి యమర్చఁబడియున్నవి. సౌధశృంగార మత్యద్భుతము. చుట్టును ఘన

# సుజనమైత్రి.

చిత్రకారుండగు రవివర్మపటము లమర్చఁబడియున్నవి. అచ్చటఁ గృష్ణమృగచర్మములు గోడలయందు వ్రేలాడుచుండెను. నేల చిత్రితములగు రత్నకంబళములును, వ్యాఘ్రచర్మములును, బఱచఁబడియున్నవి. వెడదలగు గవాక్షములకు వివిధవర్ణాంచితములగు గాజుతలుపు లమర్చఁబడియుండెను. కోకిలయింట జరిగినకల్లోలము మఱునాటియుదయమున నీసౌధమున మద నుండును మఱియొక సతీరత్నమును దర్శించుచుండిరి. ఈసతికి నలువదియేండ్లప్రాయముండును. పెనిమిటి మృతినొందినదాదిగ నాయమ వ్యవహారములన్నిటినిఁ గుమారున కప్పగించి దైవపూజవ్రతమునఁ గాలముగడపుచుండెను. ఈమె మదనునిజనని యగు కౌసల్యకాబోలు. అతడు నమస్కరించునపుడెల్లఁ గడుం గడుశ్రద్ధతో నాశీర్వదించుచు బుద్ధులఁగఱపుచున్నది. ఆహా! మదనున కెంత మాతృభక్తియున్నది! మదనుఁడుదక్క వేఱొండు సంతతిలేమింజేసి యామె యతనియం దింత ప్రేమాతిశయము చూపుచున్నది.

నాయనా! నీవొంటరివాఁడవు. గ్రామవైరముదగునా? చుట్టుప్రక్కల నిరసనముసేయఁదగునా? ఊరిపోక లెట్లుండిననేమి?

అమ్మా! నేనెవ్వరిని దూషించితిని? నేనెవ్వరిని దండించితిని! నిరాధారుల రక్షించిన నేరమొక్కటిదక్క వేతెద్దియైనను వింటివా?

శాస్త్రపురాణసమ్మతమగు ధర్మాచరణమనుల్లంఘనీయమయి నను, దేశకాలపాత్రములనుకూడఁ జర్చించవలయును. నీవు బాలుఁడవు, ప్రపంచజ్ఞానానుభవము లెక్కుడుగలవాఁడవుగావు, నేను నీజననిని, ముదుసలిని, నీవుదక్క నాకు వేఱొక యాస్తి లేదు. తండ్రీ! నన్నుఁబాటించి యీగ్రామవైరము మానుము శీఘ్రముగఁ బరిణయమాడి వంశము నుద్ధరింపుము.

అమ్మా! నీవును దెలియనిదానివలె మాటాడెదవేమి! నిరపరాధినగు నన్ను వారెట్టి యిడుములఁ బెట్టఁజూచిరి? ఎన్ని వ్యవహారముల నన్ను నిర్బంధించిరి? దైవసాహాయ్యము లేక యున్న నాగతి యేమైయుండును? వారివారిదుష్కార్యములకు వారే ప్రతిఫలము ననుభవింపకతీఱునా! నేను దైవమును నమ్మినవాఁడను. ఎన్నియిడుములుగలిగినను, ఎన్నియిక్కట్టులు రానున్నను, ధర్మమార్గమువిడచి యధర్ములును, నజ్ఞానులును నగుకూళలు నడచుమార్గము త్రొక్కనోప. ఇప్పటిస్థితినిబట్టి వివాహమున నామనము పాఱకున్నది. ఇఁకఁ గొన్నినాళ్లు జరుగ నిమ్ము. పదంపడి నీయిష్టానుసారము జరుగఁగలదు.

---

# సుజనమైత్రి

## ఇరువదిరెండవ ప్రకరణము.

---

భిక్ష.

సింహపురమున బ్రాహ్మణవీధియం దొకనాఁటిమధ్యాహ్న కాలమున నిరువురు విప్రకుమారు లేతెంచుచుండిరి. మిక్కిలి యుబికి లావైయున్న వారియుదరములఁజూడ నెచ్చటనో వారపరిమితముగ భుజించినవారివలె నగపడుచుండిరి. చేతఁ జెరియొక పంచపాత్రమును బూని భుక్తాయాసమున మెల్లఁగ నడచుచుండిరి. కొంతతడ వటులేగి యొకవిశాలంపుఁ బంచంగాంచి యటనిలువంబడిరి. అందొక్కరుఁడు "రామకృష్ణా! నేనికఁ గదలలేనురా! ఇంచుక తడవిచ్చో విశ్రమించెదము." అనియెను. రెండవ పురుషుఁ డందుల కియ్యకొన వారిరువురు నా పంచయందలి తిన్నెపైఁ బరుండి "అమ్మా! అబ్బా! యనుచుఁ బొర్లసాగిరి. ఇటులఁ గొంతకాలము భుక్తాయాసపరిహారార్థమై యిటునటుఁ బొరలినతరువాత రామకృష్ణుఁడు లేచి కూర్చుండి తనయంగీనుండి యొక బీడీచుట్టను నగ్గిపెట్టెనుదీసి బీడీనిగాల్చి గుప్పుగుప్పునఁ బొగవిడువఁ దొడంగెను. అంత రెండవవాఁడు పరుండియే రామకృష్ణుని వైపునఁజూచి "ఓరీ! భడవా! నాకు బీడీనియ్యనిదే నీవు కాల్చుకొనుచున్నావటరా!" అనెను.

రామ.—ఓహో! నీవు నిష్ఠాపరుఁడవనియు మేమందఱ మనాచారపరులమనియు మీతల్లి నిన్నటిదినమున గర్వోక్తులాడుచుండెనే? గోపాలా నీవెప్పటినుండి చుట్టల నారంభించితివి?

గోపా.—నీకుముందే. ఇఁక నీవ్యర్థపుమాటలఁ జాలించి వేగిరము బీడీనిమ్ము.

అంత రామకృష్ణుఁడు మఱియొకబీడీనిదీసి గోపాలున కిచ్చెను. ఇరువురును బీడీలఁ గాల్చుచు నిట్లు సంభాషింపఁ దొడంగిరి.

రామ.—ఏమిరా గోపాలా! కదలలేకున్నావు?

గోపా.—చిత్రాన్నము బహురుచికరముగ నుండెనురా! ఆవంట ముండాకొడుకును గొసరికొసరి వేయించుకొని భుజించితిని. అందుచేఁ గడుపుబ్బరించినట్లున్నదిరా!

రామ.—ఎవఁడురా! ఆవడ్డించిన యపాత్రుఁడు? ఎంత కొసరినను వడలు రెంటికన్న నధికముగా వడ్డింపఁడాయెను. వాఁడొంటరిపాటునఁ జిక్కినఁ బ్రక్కలు విఱుగఁ దన్నవలెననియున్నది.

గోపా.—కాదురా! వారుచేయించినదే కొంచెమట.

రా.—అవునురా మనబ్రాహ్మణార్థపువాండ్రు భిక్షచేయించిన నింతయే. నిన్నటిదినము వేణుగోపాలశర్మగారియింటిలో

నెంత తృప్తికరముగా నున్నదిరా? వడలలో మునిగి నేతిలోఁ దేలితిమి.

గో.——అవును. ఒక్కొక్కలడ్డుండ నారికేళఫలప్రమాణమురా!

రా.——పాయస మెంత దివ్యముగా నుండినదిరా!

గో.——రామకృష్ణా! ఎచ్చటను జెప్పకుము. నేను బదునైదు పంచపాత్రలపాయసము ద్రావితిని. మఱల శర్మగారియింటిలో భిక్ష లేదటరా?

రా.——ఓరీ! వెధవా! నీవు వట్టివెఱ్ఱివే? రేపు శర్మగారి భిక్షయైనసంగతి నీకుఁ దెలియదఁటరా?

గో.——రేపేనఁటరా? ఇప్పటికే నాకజీర్ణదోషము మెండుగ నున్నయటులున్నదే? రేపేమి దినఁగలనురా?

రా.——నీవు నపుంసకుఁడవు. ఇటువంటిభిక్షలు నూఱయినను నేను సరకుసేయను.

గో.——నీవు మొనగాఁడవేగాని శర్మగా రెందుకురా యిన్ని భిక్షల నిచ్చుచున్నారు? ఇప్పటికే వారైదు భిక్షలనిచ్చిరి. ఇంక నైదుభిక్షల నిడెదరఁట.

రా.——ఎందుకా? దేశాంతరము చనిన యీాయన కుమారుని కులములోఁ జేర్చుకొనుటకు. లేనియెడల శర్మగారా యిటుల సెలవుసేయునది?

గో.——అట్లయిన శర్మ కుమారుని స్వాములవారు సంఘములోఁ జేర్చుకొన్నారఁటరా?

రా.—ఇంకను విష్ణుశర్మ రాలేదుగదరా? వారేమో రాఁబోవుదు రఁట వచ్చిన వెనుకగదా యది తీర్మానమగుట.

గో.—ఎందుకుఁ జేర్చుకొనఁగూడదు?

రా.—ఎందుకా? మందుకు. నీకెందుకురా! యీ యధిక ప్రసంగము?

గో.—శర్మగారికూఁతురు కమల యెచట నున్నదిరా?

రా.—ఏటిలో. ఆభ్రష్టవిచారము నీకేలరా? ఇఁకఁ బ్రొద్దయినది. పోవుదము లెమ్ము. అజీర్ణహారమునకు నాయొద్దఁ గొన్ని ఘుటిక లున్నవి. మాయింటికి రమ్ము. నీకొక మాత్ర నిచ్చెదను. దానిని మ్రింగిన రేపటిభిక్షకు సిద్ధముగ నుండఁ గలవు.

ఇట్లు సంభాషించుచు నాతిండిపోతు లిరువురు నాపంచ విడిచి చనిరి.

---

# సుజనమైత్రి

## ఇరువదిమూడవ ప్రకరణము

---

### మంత్రము.

హిందూమతసంరక్షకుండును, వేదవేదాంతోద్ధారకుండును, జగద్గురుండును నగు నాదిశంకరునిపీఠము లనేకము లీదేశమునఁ గలవు. అందు వేదగిరిపీఠము సింహాపురమున కనతిదూరమున నుండునది. ఈకథాకాలమున నీతివిద్యావిశారదుండును, నస్ఖలితబ్రహ్మచారియు, సదాసన్మార్గప్రవర్తకుండును, దానకర్ణుఁడును నగు నొకమహనీయుఁ డాపీఠము నలంకరించుచుండెను. వేణుగోపాలశర్మగారి ప్రేరితమున సింహాపురవాసు లాయాచార్యులవారి కామంత్రణము నంప సపరివారముగ వారు సింహాపురి కేతెంచిరి. సింహాపురివాసు లామహనీయు నెంతయు గౌరవమున నాదరించిరి. బ్రాహ్మణులును, శూద్రులును, వైశ్యులును ననేకభిక్షల నొసఁగుచుండిరి. గౌరవనీయులును ధనికులు నగుపౌరు లొకరికన్న నొక రెక్కుడు డాంబికమున భిక్షల నీయఁ దొడంగిరి. అనేకులు పాదపూజకై యాస్వాములవారిని దమ గృహములకుఁ గొంపోయి యనేకవిధములఁ బూజించి కట్నముల నొసంగుచుండిరి.

విప్రకుమారుల సంభాషణ జరిగిన మఱుసటిదినమున వేణుగోపాలశర్మగారియింట నాఁటిభిక్ష జరుగనాయెను. సూర్యోదయమైనంతనె భటు లశ్వములను గజములను నొంటెలను నెక్కి ఢంకాలవాయింపఁ బలువిధములగు వాద్యవిశేషములు దిశలం బిక్కటిల్ల వేదపారాయణము సేయు బ్రాహ్మణులు వెంటఁ జను దేర స్వాములవారు నవరత్నఖచితములగు కిరీటములను, భుజకీర్తులను, మనోజ్ఞములగుహారములను, పీతాంబరములను ధరించి యతిరమణీయముగ నలంకరింపఁబడిన పల్లకియందు సుఖాసీనులై స్వాములవా రత్యంతవైభవమున శర్మగారియింటికిం జనెను.

దారియందంతటను జనులు గుంపులుగూడి స్వామిముఖ సందర్శనము గావించుచుఁ గృతార్థులగుచుండిరి. శర్మగారిసదనమునఁ జేరినంతనె వారతివినయమున నెదురుగ నేతెంచి స్వాముల వారి పాదములఁగడగి తత్పాదస్పర్శమునఁ బవిత్రీకృతములయిన జలములఁ దన తలపైఁ జల్లుకొని, యతి భక్తియుతముగ నయ్యాచార్యు నుచితాసనాసీనుం గావించిరి. శర్మగారి బంధుమిత్రవర్గములెల్ల నచ్చోటికి విచ్చేసి స్వామివారిం బూజించి కృతార్థులైరి. నాఁటిమధ్యాహ్నకాలమున జరిగిన భిక్షావైభవమును వర్ణింప నెట్టివారికిని నలవిగాదు. శర్మగారు ప్రయాసమునకును సెలవునకును వెనుదీయక భిక్షం జరపించిరి.

భోజనానంతరమున నతిథులెల్లరును సంతృప్తులై నిజనివాసముల కేగినపిమ్మట ముంగిలికూటమున స్వామివారు సభ

# సుజనమైత్రి.

దీఱిరి. ఆసభయం దనేకులు పండితాగ్రేసరులగు విప్రోత్తములు చేరి శాస్త్రపర్యాలోచనము సేయఁదొడఁగిరి. ఆసమయమున వేణుగోపాలశర్మ గారును, మఱియొకపురుషుఁడును వెంతనున్న మఱియొకగదియం దాసీనులై యుండిరి. ఆపురుషుఁడు రత్నఖచితములగు మణికంకణములును, గుండలములును ధరించి విలువగల జరీవస్త్రములచే నలంకృతుండై యుండెను. అతఁడు ప్రాయము చెల్లినవాఁడుగ నుండెను. వారిరువురును దాంబూల మాచరించిన వెనుక శర్మగా రాపురుషుని గని చిఱునగవుతో నిట్లనెను. "దివాన్‌జీగారూ! కార్యార్థినై మిమ్ముల నాశ్రయించినవాఁడను ఎటులనయిన నాకభయవాక్యమిత్తురని ప్రార్థించెదను."

దివాన్.—ఈవిషయమున మీరంతగఁ బ్రార్థింప నక్కఱలేదు. అవకాశమున్నంతవఱకు మీకు సాహాయ్యముసేయ సిద్ధముగ నున్నవాఁడను. మీకోరికల సెలవిండు.

వేణు.—ప్రథమమున దేశాంతర్గతుఁడగు నాకుమారునిఁ గులమున నాంక్షలేక సన్మానింతురని ప్రార్థించెదను.

దివాన్.—అతఁ డిపు డెచ్చట నున్నవాఁడు?

వేణు.—ఆంగ్లేయదేశమున వైద్యవిద్యను బరిపూర్ణముగ గ్రహించి గొప్పరాజకీయోద్యోగమును సంపాదించి మన దేశమునకు రానున్నవాఁడు. కతిపయదివసముల కాతఁ డిచ్చోట నుండఁగలడు.

దివాన్.—ఇది మిక్కిలి దుర్ఘటమే?

వేణు.—తమదయ.

దివాన్.—[కొంతతడ వాలోచించి] రాజకార్యార్థమై యన్య దేశములకుఁ జనువారికి మన్ననగలదు. ఆయాధారమున మీకుమారునికొఱకు నావలననైన శ్రమపడెదను. అయిన నీవిషయమున స్వాములవారిచిత్త మెటులుండునో!

వేణు.—మీరు మనసారఁజేయఁదలచిన నిది యొకపనిగాదు.

దివాన్.—తమ రెండవ యభీష్టమెద్ది?

వేణు.—నావిరోధియు, మత్సంసారభంగమునకుఁ గారణభూతుండును నగు సుందరుఁ గులభ్రష్టుంగావించుటయే నా రెండవ యభీష్టము.

దివాన్.—మతవైరుధ్యంబుగ నతఁడొనరించిన యకార్య మెయ్యది?

వేణు.—ముగ్ధయగు నాకూతుం బరిగ్రహించుటయే!

దివాన్.—అందులకు సాక్ష్యము!

వేణు.—"ఇదిగో! వారిరువురు రాజధానియం దేకాంతస్థలముల యందు విహరించుచుండఁ జూచిననాస్నేహితులు నాకంపిన లేఖనము లివి." అని యాజాబుల దివాన్‌గారి చేతికందిచ్చెను. దివాన్‌జీగా రాజాబులఁ జదువుకొని కొంతతడ వాలోచించి "ఇయ్యది సందేహాస్పదమే; కర్తవ్యము విచారించెద" నని.

# సుజనమైత్రి.

యా లేఖనములఁ గేలంబూని యాగదివీడి యరిగెను. వేణుగోపాలశర్మయుఁ గొంతతడ వాఁగి స్వాములవారి సభఁ జేరెను.

సాయంకాలమగునంత స్వాములవా రతివిభవమున శర్మగారిగృహమువిడిచి తన విడిదిగృహమునకుఁ బోయిరి.

---

# సుజనమైత్రి

## ఇరువదినాల్గవ ప్రకరణము.

---

### ద్వేషము.

ఇటు లత్యంతవైభవమున స్వాములవారు సింహపురియం దున్నసమయమున సుందరుని తల్లియగు రాజ్యలక్ష్మికి దేహ మస్వస్థమై మిక్కిలి బాధగలిగెను. ఈసమాచారము మదనునకుఁ దెలియ నాతఁడు సింహపురికిం జని యామె కెన్నియో యౌషధ ముల నిప్పించెనుగాని యామెకు వ్యాధి ప్రబలమయి ప్రాణము దక్కుటయే యనుమానముగ నుండెను. అట్టిసమయమున నాయమ తనకుమారునిఁజూడ నిచ్ఛ యొఱంగింప మదనుఁడు సుందరునకుఁ దంతివార్త నంపెను. తల్లికిఁ గలిగిన యాపదకు సుందరుఁ డెంతయుఁ జింతిల్లి యేకాకిగ సింహపురమునకుఁ జేరెను.

తల్లి కుమారుఁజూచి శోకాక్రాంతయై కన్నీరుగార్చుచుఁ గుమారుని దగ్గరకుఁబిలచి ముద్దాడి యిట్లనెను.

"నాయనా! నీకు వివాహము గాఁకమున్నె నిన్నొంటరిగా విడిచిచనుటకై యెంతయుఁ జింతిల్లుచున్నదానను. అటుపయి సర్వమును భగవదనుగ్రహానుసారమే జరుఁగగలదు. శీఘ్రముగ

వివాహమాడుము. నీశత్రువర్గముల విషమప్రయత్నములు నిన్నేమియు బాధింపనోపవు. సర్వకాల సర్వావస్థలయందును భగవంతుఁడు నిన్నుఁ గాపాడుఁగాక." అని దీవించి తనతలక్రింది దిండును జూపించి "నాయనా! నామరణానంతర మీదిండును విప్పిచూడుము. అందుఁ గొంత ధనముండఁగలదు. అంత్యకాలమున నీతల్లి నీకొసంగెడు కానుక యయ్యదియే." అని చెప్పెను. మఱియు మదనునిహస్తమున సుందరుని కరంబునిచ్చి "మీయిరువురమైత్రి శాశ్వతమై జగత్ప్రసిద్ధమై వర్ధిల్లుఁగాక." అని యామె వారి నాశీర్వదించుచు నుసురులవిడిచెను. మదనుఁడును సుందరుఁడును నొకవైపున నేలపైవ్రాలి రాజ్యలక్ష్మి యాత్మ రక్షించుటకు భగవంతునిఁ బ్రార్థించిరి. శవమును శ్మశానవాటికకు మోసికొనఁబోవ బ్రాహ్మణు లెవ్వరును నియ్యకొనరైరి. కారణమరయ సుందరుఁడు స్వాములవారి యానతిప్రకార మాంతుయందున్నటుల దెలియనయ్యెను. సుందరుఁ డిద్దాని విని నంతనె దిగ్భ్రమనొంది యేమియుఁదోఁచక నిలువంబడెను. అంత మదనుఁడు మిక్కుటముగ ధనమిచ్చి బ్రాహ్మణులఁ గొందఱి నొప్పించి రాజ్యలక్ష్మికి దహనసంస్కారము లొనరింపఁజేసెను. మదనుని సాహాయ్యమున సుందరుఁడు దల్లికిఁ గర్మక్రతువులనెల్లఁ గావించెను. కర్మ జరిగిన మఱునాఁడు స్వామివారి యాస్థానమునుండి సుందరునకు, నాతని తల్లియొక్క కర్మక్రియలయందుఁ దోడ్పడినవారలకును స్వాములవారిని దర్శించుటకై యుత్తరువు లంపఁబడెను. సుందరునకుఁ దోడ్పడిన విప్రులందఱు నాలస్యముసేయక స్వామి

వారిని క్షమాపణను వేఁడి వారివలనఁ దీర్థములఁ బుచ్చుకొని మన్ననవడసిరి. సుందరుఁ డిది యంతయు వేణుగోపాలశర్మ గారి కృత్యమున జరిగినదని యెఱిఁగి స్వాములవారిని సందర్శింపఁ డయ్యె. తమ యాజ్ఞానుసారముగ సుందరుఁడు దమ్ము సందర్శింప నందులకు స్వాములవారు సుందరుని యాంక్షను ఖాయ పఱచెను.



# సుజనమైత్రి

## ఇరువదియైదవ ప్రకరణము.

---

దురాలోచన.

పిమ్మట నొకనాఁటి సాయంకాలసమయమున వేణుగోపాల శర్మగారియింట నేవురు పురుషులుసేరి యాలోచన నేయుచుండిరి. అందున్నవారిలో వేణుగోపాలశర్మగారన మనకిదివఱకే తెలియును. తక్కిన నలువురిలో నిరువురు బ్రాహ్మణులు నిరువురు శూద్రులుగానుండిరి. ఈనలువురు చిన్నిరాయని పురవాసులు. వీరేవురును దీర్ఘకాల మెద్దానింగూర్చియో యతిరహస్యముగ నాలోచించుచుండిరి వారిమొగమ్ములఁజూడ వారెద్దియో యొక ప్రమాదకరమగు విషయమునుగూర్చి యోజించుచున్నటులఁ దెలియనగును. అంతఁ గొంతకాలమునకు వేణుగోపాలశర్మగారచటనున్న బ్రాహ్మణులలో నొక్కనిం దిలకించి యిట్లనెను.

ఇంకను నుపన్యాసములు జరుగుచున్నవా ?

బ్రా:— మెండగుచున్నవి. ఎక్కడఁజూచినను జాతిభ్రష్టత్వము గావలెననియుఁ, గులాచారములు నేలఁ గలుపవలెననియు, స్వాములవారియానలఁ దిరస్కరింపవలెననియు నుపన్యాసములు జరుగుచున్నవి. మాయూరనే యిప్పటికి నాలుగైనవి.

ప్రక్క గ్రామములయందుఁగూడ సుందరమదను లుపన్యాసము లిచ్చునటుల నేర్పఱచుకొనియున్నవారు. నావుడు నటనున్న యిరువురు గాఁపులలో నొకఁ డిట్టు లనియెను.

అయ్యా! దీనికంతయుఁ గారణభూతుఁడు మదనుఁడే. వానివలన మా గ్రామము పాడగునటులనున్నది.

వే.—కాదు కాదు. మదనునిఁ జెఱిచినది సుందరుఁడే. ఆదుర్మార్గుని బరిమార్చిన నంతయు సరియగును.

బ్రా.—వీరిరువురిలో నెవరున్నను ప్రపంచమునకు హానియే!

వే.—అటులయిన మీ యిచ్చవచ్చినటులఁ గావింపుఁడు.

బ్రా.—మీసాహాయ్యము పరిపూర్ణముగ నుండఁగోరెదము.

వే.—అభ్యంతరము లేదు.

అంత నానలువురు పురుషులును వేణుగోపాల శర్మగారి సదనము వెలువడిరి.

శర్మగారేమియుఁ దోఁచనివానివలె నిటునటుఁ గొంతతడ వూరక తిరిగి, యాగదియందున్న యొక పేటికం దెఱచి, యద్దానిలోనుండి యొక లేఖనముందీసి చదువ నారంభించెను. అది ముగిసినపిమ్మట, మఱల నాజాబును పేటికయందిడి తనలోఁ దా నిట్లనుకొనఁ దొడంగెను.

ఓహో! యిది మనకనుకూలమే. రేపుగదా విష్ణుశర్మ రాజధానిం జేరునది. నే నీదినమే రాజధానికేగెదను. ఈఘో

కృత్యము జరుగునపుడు నేనిచట నుండఁదగదు. ఏమంటిని? ఘోరకృత్యమనియా? కాదు మున్ను మతాచార విరోధులగు దుర్మార్గులఁ దెగటార్చుటకై శ్రీమన్నారాయణుఁ డీప్రపంచమున నవతరించలేదా? సుందరా! నీవా! నన్నుఁ దిరస్కరించువాఁడవు? నీ ప్రాణములను నీవు గాపాడుకొనుము. అని యతి త్వరితముగ రాజధానికిఁ బయనమై యిలు వెడలెను.

---

# సుజనమైత్రి

## ఇరువదియాఱవ ప్రకరణము.

---

**ఘోరకృత్యములు.**

మఱునాఁడు సాయంకాలసమయమున రాజధానియందు బంధుమిత్రసమేతుఁడై వేణుగోపాలశర్మ కుమారుని సందర్శించు కుతూహలమున ధూమశకటనిలయమున కేగెను. ఆనాఁటిబండి యందు విష్ణుశర్మ రాఁడాయెను. కాని మఱునాఁ డేతెంచునటుల విష్ణుశర్మయొద్దనుండి తంతివర్తమానము రాఁబడెను. మఱునాఁడు మఱల వేణుగోపాలశర్మ ధూమశకటనిలయమునకుఁ జని కుమారునికొఱకై వేచియుండెను. బొంబాయినగరమునుండి ధూమశకట మేతేఱ వేణుగోపాలశర్మ యాశకటమంతయుఁ గుమారునకై వెతకిన నతఁడు గాన్పించనందున నాఁటికిని విష్ణుశర్మ రాలేదని యనుకొని దీనవదనమున నొకచెంత నిలువఁబడెను. అపుడొక యువజనుఁ డాంగ్లేయుల యుడుపులధరించి కడురాజసమున వేణుగోపాలశర్మగారికడ కేతెంచి నమస్కారపూర్వకముగ "తండ్రీ! నన్ను గుర్తించలేదా?" అని యడిగెను. అపుడు వేణుగోపాలశర్మ కుమారుని గుర్తించి మిగులఁ దమకమున నాతనిఁ గౌఁగిలించి ముద్దాడెను. కొంతతడవు తండ్రితో ముచ్చటించి తనమిత్రులగు కొంద ఱాంగ్లేయులతో రాజధానియందున్న యొకయాంగ్లేయభోజనశాలయందుఁ దానుండ నిశ్చయించు

కొన్నటులను, మఱునాఁటియుదయమునఁ దండ్రి తనతావునకు రావలసినటుల వేణుగోపాలశర్మగారి కెఱింగించి విష్ణుశర్మ యచ్చోటు వాసెను.

కుమారుని జాతిభ్రష్టత్వమున కెంతయుఁ జింతిల్లుచు వేణుగోపాలశర్మ నిజమందిరమును జేరెను. మఱునాఁటియుదయమున స్నానసంధ్యాద్యనుష్ఠానములఁ దీర్చి కుమారుని యాస్థానమున కేగెను. కుమారుఁ డెచటికో యాకస్మికముగ నేగినటు లెఱిఁగి యాతనికొఱకుఁ గొంతదడవు వేఁచియుండ నతం డతి రౌద్రాకారమున నిలు సేరెను. కుమారుని వెంటనే తండ్రియు లోనికిఁజని యాతనిచెంతఁ గూర్చుండి "నాయనా! సంతాపమునకుఁ గారణమేమి?" యని యడిగెను. అందులకు విష్ణుశర్మ "కారణమీవ" యనిన వేణుగోపాలశర్మ యతిసంభ్రమమున "నేనా? నేనేమిచేసితి" ననెను.

విష్ణు.—"ఏమిచేసితి ననియెదవా? నీవేమిచేసినది యీవార్తాపత్రికయందుఁ గలదు. నేనీయుదయమున నీరాకకై వేచి యుండఁ గమల యత్యావశ్యకముగ నన్ను రమ్మని కబురంపె. ఆమెతావునకుం జన నెల్లవిషయములును దెల్లమయ్యె. హా జనకా! భగవంతుఁడు నీపాపమునుండి నిన్నుఁ గాపాడుఁ గాక." నావుడు వేణుగోపాలశర్మ నిశ్చేష్టితుఁడయ్యె. విష్ణుశర్మ వార్తాపత్రికనుండి యిబ్భంగిఁ జదువఁదొడంగెను.

సింహాపుర వృత్తాంతములు: నిన్నటిదినమున నీపురమున కనతిదూరమున నున్న చిన్నిరాయనిపురమున నతిఘోరమగు

వధ జరుపఁబడెను. సింహపురినివాసుఁడును, విశ్వవిద్యాలయ మునఁ బ్రసిద్ధిగాంచినవాఁడును నగు సుందరుఁడును, నతని మిత్రుఁ డును, జిన్నిరాయని పురనివాసుండును నగు మదనుండును సంఘ సంస్కారవిషయములను గుఱించి చెంతనుండు గ్రామముల నుపన్యసించి యింటికే తెంచుతఱి రాత్రికాలమున దారిలోఁ గొందఱు వారలఁ జంపునుద్దేశమునఁ బైఁబడి ఘోరాయుధం బుల నిరువుర హింసించినటులను, మదనుఁడచ్చోట నే మృతిచెంది నటులను, సుందరుఁడు స్మృతిహీనుఁడై క్రిందఁబడినటులును నాతఁ డిపుడు సింహపుర వైద్యశాలయందున్నటులును, నతని బ్రతుకు దుర్ఘటముగ నున్నటులున్ను విని మిక్కిలి చింతించుచున్నాము. ఈవిషయమునఁ జిన్నిరాయని పురనివాసు లనేకు లిప్పటికే దండ నాధికారులచేఁ బట్టుపడిరట. ఇంక ననేకులు గౌరవనీయులు నీపురముననున్న న్యాయవాదులు గొందఱు ఈఘోరకృత్యము నందుఁ గలిసినటులఁ దెలియవచ్చినదట. శీఘ్రముగ ననేకులు పట్టుబడఁగలరు.

నీయుద్యమము ఫలించెనా.

నాపుడు వేణుగోపాలశర్మ నిశ్చేష్టితుఁడై యేమిసెప్పుటకు నోరాడక యూరక నిలువంబడెను. ఎట్టకేలకు ధైర్యము తెచ్చు కొని "ఎవ్విధమున నైన శత్రునాశనము సమ్మతముగదా" అనెను.

విష్ణు—ఎరికి సమ్మతము! నీబోటి కిరాతులకా?

వేణు.—నాయనా! మన సంసారసుఖభంగమునకుఁ గారణ భూతుఁడు సుందరుఁడు. అతని కృత్యములయం దన్నిటి

యందును మదనుఁడు తోడ్డై యుండెడివాఁడు. అట్టివారి యందుఁ గనికరముంచరాదు. నినుగూడునాసచే నన్నికష్టములు మఱచియుంటిని. ఇట్టిసమయమున నాకుఁ దోడ్డై యుండక నన్ను విడనాడఁజూచుట ధర్మమా? అని కన్నీరు గార్చుచుఁ గుమారునిఁ గరంబులఁ బట్టుకొనెను.

విష్ణు.—"అయ్యో! వినుము. నీ యీకార్యమువలనఁ గమలాశారదలు బ్రతికియుండుట దుర్లభము. ఇఁక నీవు సుఖముగ నుండనగును. నీకును నాకును నేటితో ఋణము తీరినదనుకొనుము. నీబాంధవ్యము నేనొల్లను. నీప్రాయశ్చిత్తము నాకవసరము లేదు. నాయందుఁ దయగొని యీక్షణమున నన్నుఁ బాయుము. నీదగు కఠినహృదయమునకును బాపకర్మములకును భగవంతుఁడు నీకుఁ బ్రతిఫలమొసంగుఁగాక." అని యటనున్న తనగదిలోనికిఁ బోయి ద్వారమును మూసికొనెను వేణుగోపాలశర్మ యతిశోకాక్రాంతమానసుండై యేమియుఁ దోఁచక వెలివడి తక్షణమున సింహపురమునకుఁ బయనమైనవాఁడయ్యెను. దారియందంతట వేణుగోపాలశర్మ యతిమానాకారుఁడై యెద్దియో యోజించుచుండెను. ధూమశకటము సింహపురముఁ జేరునప్పటికి నిశాసమయమయ్యెను. తిన్నఁగ నింటికిఁజని కవాటముల బంధించి యందిటు నటుతిరుగుచు మాటాడుకొనుచుండెను. ఎట్టకేలకుఁ దన పేటికందీసి యద్దానినుండి యొకగాజుపాత్రమును వెలిదీసి చేతనుంచుకొని యిటులనఁ దొడంగెను.

హా! దండనాధికారులవలని భయమొకచెంత బాధించుచుండ, విష్ణుశర్మ కఠినోక్తులు నన్నుఁ జంపుచున్నవి. కుమారా! నన్ను విడనాడుట నీకు న్యాయమా? అవును. వేణుగోపాలశర్మ కుమారుఁడన్న నీకును నవమానముగదా! సుందరా! నీవే జయించితివి! హా! నేనెట్టిపాపిని! ఎట్టిమూఢుఁడను! ఇఁక నేను జీవించియు నేమిఫలము? అవమానము దప్పదు. అని యాగాజు పాత్రమును నోటఁబెట్టుకొని యందున్న ద్రావకమును ద్రాగెను. కొంత తడ విటు నటు తిరిగి, క్రిందఁబడి యిటు లార్వ నారంభించెను.

ఎవ్వరు మీరు? నన్ను లాగకుఁడు. త్రోయకుఁడు. నేనే వచ్చెదను. అయ్యో! మదనా! ఏల యూఱక చూచెదవు? ఈ కింకరుల బారినుండి నన్ను రక్షింపుము. అయ్యో! చచ్చితి. చచ్చితిని.

ఇట్లు కొంతతడ వఱచి ప్రాణములు విడిచెను. మఱునాఁటి యుదయమున దండనాధికారులు వేణుగోపాలశర్మ రాతిరి యిలు సేరిన దెఱిఁగి వారికొఱకై యచ్చోఁ జేరిరి. కాని కవాటములు బంధితములై యుండెను. ఎంత యఱచినను నెవ్వరును ద్వారముం దెరువరైరి. పిదప వారు కవాటములఁ బగులఁగొట్టి లోనికిం జని కని నపు డాత్మహత్యచేఁ బ్రాణములఁ బాపుకొన్న వేణుగోపాల శర్మగారి కళేబర మతిఘోరముగఁ గ్రిందఁబడియుండెను.

# సుజనమైత్రి

## ఇరువదియేడవప్రకరణము

---

తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును.

మదనుని యందుఁ జిన్నరాయపుర నివాసు లనేకుల కసూయతయున్నను నాతనిఁ జంపు నుద్దేశము బాణకోదండుల యాప్తబంధువులకుమాత్రము గలిగినది. కావున నాతని మరణము విన్నంతనె యాపురమున నల్లకల్లోలము గలిగెను. మదనుని సుగుణములెల్ల నపుడు ప్రఖ్యాతికి రాఁదొడంగెను. ఆతనిఁ జంపినవారియం దేరును గనికరముంచక మరణదండనకుఁ బాత్రులఁ గావించిరి. మదనుని మరణము వినినంతనె యాతని జననియగు కౌసల్య భరించరాని శోకమునఁ బ్రాణములు విడిచెను. తత్పుర వాసులెల్లరు నిరపరాధియు ధర్మాత్ముఁడును నగుమదనుని గుణాతిశయముఁ దలఁచుకొని మిక్కిలి చింతాక్రాంతులైరి. మాతృసుతుల పేర నొకయాలయము నిర్మించి వారల నందుఁ బ్రతిష్ఠజేసి పూజింపఁ దొడంగిరి.

సుందరుఁడు క్రమమున కమల శారదలయొక్కయు, విష్ణుశర్మయొక్కయు నుపచర్యలచే స్వస్థుండాయెను. మదనుఁడు జీవించియుండఁగనె తనకున్న గ్రామవైరమువలనఁ బ్రాణాపాయము గలుగవచ్చునని యాలోచించి, తానకాలమునఁ జచ్చిన

యెడల జరుగవలసిన కార్యముల నొక పత్రికయందు లిఖించి యుంచెను తనతల్లి జీవితమునకుఁ గావలసిన కొలఁదియాస్తి దక్క, తక్కిన తనయావదాస్తిచేఁ జిన్నిరాయనిపురమున నిమ్న జనోద్ధారణమునకై యొకవిద్యాలయము నిర్మింపఁబడవలెననియు నద్దానియం దన్నిజాతులబాలురకును బాలికలకును ధర్మార్థముగ విద్య నేర్పించవలెననియు, నిద్దాని కంతకు సుందరుఁడు కార్య నిర్వాహకుఁడుగ నుండవలెననియు, మదనుఁడు లిఖించెను. మదనుని యుద్యమము లరసినంతనె చిన్నిరాయనిపురవాసు లందఱు మిక్కుటముగ సుందరునకు సహాయులై విద్యాలయ మును బూర్తిగావించి "మదనుని విద్యాలయ"మని నామకర ణము గావించిరి. సింహాపురమందలి నిమ్నజాతులవారందఱు మదనుని దైవముగఁ గొలుచుచు నాతని విద్యాలయమునకుఁ దమ బాలుర నంపిరి.

తరువాతఁ గొన్నినాళ్లకుఁ గమలాసుందరులును, శారదా విష్ణుశర్మలును బ్రహ్మసామాజికపద్ధతులప్రకార మొండొరులఁ బరిణయమాడిరి. వారు రాజధానియందే యుండి యత్యున్నత పదవిం జేరిరి. ప్రతిసంవత్సరమును మదనుని మరణదినమున వారం దఱును చిన్నిరాయనిపురమునకుఁ జని యచ్చో మదనునిఁ బూజించుచుండిరి. సుందరునకుఁ గలిగిన ప్రథమపుత్రునకు మద నని నామమిడిరి. మదనుఁడు చచ్చినను బ్రతికియేయున్నవాఁడు. ఆతనికీర్తి యాచంద్రార్కముగఁ బ్రపంచమున వర్ధిల్లుచుండును. కాని వేణుగోపాలశర్మను దలంచువా రెవ్వరును లేరు. తన

## సు జ న మై త్రి.

బిడ్డలచే విడనాడఁబడి, తాను చేసిన పాపకృత్యములకుఁ జింతిల్లుచు నాత్మహత్య గావించుకొన్న యావేణుగోపాలశర్మ యుద్యమము లేవి కొనసాగినవి? తానొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును. ధర్మమే జయించును.

చదువరులారా! ప్రపంచమున న్యాయముగఁ బ్రవర్తింప నెంచువారలకుఁ గష్టము లనేకములు గలుగుచుండును. ఎట్టికష్టములకును వెనుదీయక మదన సుందరులవలె దీనరక్షణకై పాటుపడుమహానీయులు, పూజనీయులు.

స మా ప్త ము.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1939.

